## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.



" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# పురాణ వాఙ్మయము

రచయిత

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

రీడరు, తెలుగు శాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైద్రాబాదు.




ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - హైదరాబాదు - 500004

# ముందు మాట



ఎన్నో ఏళ్ళుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగ నున్న పర్వసమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతి నిధులందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండు వేల అయిదు వందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహన రాజుల కాలం నుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారత దేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదు కోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిది. బౌద్ధ పూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్ద ఎత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్ళడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ అంతర్జా తీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చిచర్చించి నిర్ణయించుకోవడానికీ, తద్వారా వివిధ చైతన్యస్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు ఆర్ద్రమైన భావసమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగల వనీ, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజుల పాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాల నుంచి, వివిధ రాష్ట్రాల నుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థల నుంచి విచ్చేసిన ప్రము

ఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చా గోష్ఠులు జరుగుతాయి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటంచేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగు వారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియంను)స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదంచేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయిత లందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినవి ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయసాధనకు పూనుకొనడమేకాక జాతీయ అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు.

# పరిచయము



సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగు దేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975 సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది, అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింప జేయుటయేగాక, ప్రపంచములోని వివిధ దేశాలలో వసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభలు హైదరాబాదున జరుగునటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక అహ్వానసంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు; విద్యాశాఖా మంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్య నిర్వాహకాధ్యక్షులు: ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్రభాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తములు ప్రామాణికములు నగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్య నిర్వహణకై 44 మంది సభ్యులు కల ఒక విద్వత్‌సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది. ఆ విద్వత్ సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయారంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా. సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని

ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప వలసినదిగ ప్రపంచ తెలుగు మహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలతకొరకై కృషి చేయు సంకల్పంతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో 'పురాణ వాఙ్మయము' అను ఈ గ్రంథమును, రచించిన డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారు ఆంధ్ర పాఠక లోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతా బద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన మురళీ పవర్ ప్రెస్‌వారికి మా కృతజ్ఞత.

హైదరాబాదు
తేది, 15-3-75.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.

# అనుక్రమణిక

శ్రీ

# పురాణవాఙ్మయము

పురాతత్త్వ జిజ్ఞాసువు లైన ఆర్షమనీషులు సర్గప్రతిసర్గాది మహావిషయములను శ్రుతిస్మృతి పరమార్థానుసంధానవృత్తు లై భావించి, దర్శించి, వానిని చతుర్వర్గఫలోపాత్తము లగునట్లు మిత్రసమ్మితములుగా ప్రపంచించిన సంహితాస్వరూపములు పురాణములు. అనంతకాలస్వరూపుడై, సృష్టిస్థితిలయాత్మకమైన విశ్వసంసార చక్ర పరిభ్రమణమునకు సాక్షీభూతు డగు పురాణపురుషుని పరతత్త్వ ప్రతిపాదనము పరమ ప్రయోజనముగా నెంచుకొని తదర్థమును త్రివిధ భాషల నాశ్రయించి వ్యక్తీకరించు సారస్వతమూర్తులు పురాణములు! ఆగమార్థ జలసేచనముచే భారతీయ హృదయక్షేత్రముల నార్ద్రీకరించి, ఆర్ష సంస్కృతి సస్యములను పండింప నేర్పరచిన రసప్రవాహములు పురాణములు! అపార కథానిధులను చూపి మురిపించుచు, అమూల్యశాస్త్రవిధులను చెప్పి యొప్పించుచు కవిరసిక ముముక్షు జనములయొక్క రచనా ప్రసంగ వ్యాసంగముల నుపలాలించు మాతృమూర్తులు పురాణములు!

భారతదేశమున సంస్కృతభాషలో వెలసిన సాహిత్యప్రక్రియ లన్నింటిలో ప్రజల కత్యంత సన్నిహిత మైన ప్రక్రియ పురాణము. వేద ధర్మము భారతీయ సంస్కృతికి మూలకందము. దానిని లోకమున సుప్రతిష్ఠిత మొనర్చుట కేర్పడిన సులభసాధనములు పురాణములు. అందువలననే ''వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణేష్వేవ సర్వదా'' అని నారదీయ మహా పురాణమును, "వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే నాత్ర సంశయః" అని స్కాందమును వక్కాణించినవి. ఈ సత్యమునే 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' అని మహాభారతము చాటి చెప్పుచున్నది.

సంస్కృతి బీజములు మొలకెత్తుట కనువైన క్షేత్రము సమాజము. సమాజ జీవితమున వేదధర్మమునకు సంబంధించిన విజ్ఞానము వికసింపవలె

నన్నచో సాహిత్య మొక శక్తిమంత మైన సాధనమని మన ప్రాచీనులు గుర్తించిరి. మానవజీవిత మంతయు చతుర్విధ పురుషార్థ సాధనయే పరమార్థముగా కలిగి యున్నది. ధర్మార్థ కామ మోక్షములు పురుషార్థములు. ధర్మము మిగిలిన మూడింటికి మూలము. అర్థకామములు సమాజాభ్యుదయ సాధనములు. మోక్షము మానవు డధిరోహించు జ్ఞానశిఖరము. పురుషార్థ సాధన లక్ష్యముతో సమాజము క్రియాశీల మైనప్పుడు ధర్మము మానవశీలమునకు నిర్దుష్టమైన మార్గమును నియమించి విశ్వశ్రేయోదృక్పథము నలవరచును. 'ఆత్మవత్ సర్వభూతాని' అను విశ్వజనీనమైన సంస్కారమును పరిమళింపజేయును. ఆ సంస్కారముతో వర్తించు సామాజికుడు అర్థార్జనము నందును, కామపురుషార్థ సాధనమునందును వ్యక్తితో పాటు సమాజము కూడ శ్రేయోమార్గమున అభ్యుదయము సాధింపవలె నని కృషి చేయును. చివరకు ముముక్షువు సైతము తాను సాధించిన జ్ఞానామృతమును జనావళికి పంచిపెట్టి సమాజ కల్యాణమునకు సాధనభూతు డగును. సమాజమునందిట్లు వ్యవస్థిత మైన సర్వవిధ మానసిక ప్రవృత్తుల ధర్మ చైతన్యము నుపలక్షించి తీర్చిదిద్దబడిన సాహిత్య ప్రక్రియ పురాణము.

పురాణ మనగా ప్రాచీన మని అర్థము. ఋగ్వేదమున పురాతన మను అర్థమున పురాణశబ్దము విశేషణముగా వాడబడి యున్నది. అథర్వ వేదమున 'పూర్వకథ' 'ప్రాచీన కథ' అను అర్థము నిచ్చు విశేష్యముగా కూడ ప్రయోగింపబడినది. ఋక్సామములును, ఛందస్సులును, పురాణమును, యజుస్తోత్రములతో కలిసి పవిత్ర సవనోచ్ఛిష్టము నుండి జన్మించిన వనియు, రుద్రుడు బృహద్దిశ యగు ఈశాన్యమునకు కదలిపోగా అతనివెంట ఇతిహాసము, పురాణము గాథలు, నారాశంసలు కదలిపోయె ననియు అథర్వ వేదమున ప్రస్తావింపబడి యుండుటచే[1] ఆ వేదకాలమున పురాణ మితిహాసాదులతో పా టొక సారస్వత ప్రక్రియగా గుర్తింపబడె ననియు, పురాణములు వేదములవలె ప్రాచీనము లనియు

1. 'ఋచః సామాని ఛందాంసి పురాణం యజుషా సహ। ఉచ్ఛిష్టా జ్జజ్ఞిరే సర్వే దివి దేవాదివిశ్రితః' అథర్వవేద. XI. 7.24.
'స బృహతీందిశ మనువ్యచలత్। త మితిహాసశ్చ పురాణం చ గాథాశ్చ నారాశంసీ శ్చానువ్యచలన్॥ ఇతిహాసస్య చ వై పురాణస్య చ గాథానాం చ నారాశంసీనాం చ ప్రియంధామ భవతి య ఏవం వేద'—అథర్వవేద. XV. 6.10-11.

తెలియుచున్నది. శతపథ బ్రాహ్మణమునందును, ఉపనిషత్తులందును ప్రాచీన గాథలను వర్ణించునవిగా పురాణములు పేర్కొనబడినవి.[2] ఆ తరువాత నిఘంటువులు, పురాణములు ఒనర్చిన పురాణ శబ్దనిరుక్తులు దాని కుపబలకముగా నున్నవి. వానివలన పురాణములన చిరకాలమున పుట్టిన వనియు[3] ప్రాచీనవిషయములను తమయందు పొందుపరచుకొనిన వనియు,[4] ప్రాచీన కాలమున నవీనములుగా నుండిన వనియు[5] పురావిషయములందు జీవించెడి వనియు,[6] ప్రాక్తన విషయాభిరతి కలిగిన వనియు,[7] పురాతన కల్పవస్తుకము లనియు[8] ఏర్పడుచున్నది.

పురాణ మనగా పురాతన వస్తు సంబంధి యని తేలినది. అది యొక్కటియే పురాణ లక్షణ మైనచో ఇతిహాసముకూడ అటువంటిదే. 'ఇతిహాసం పురావృత్త' మ్మని అమరసింహుడు. "ఇతిహాసః– ఇతి హ పారంపర్యోపదేశ ఆస్తే అస్మిన్ ఆస ఆధారే ఘఞ్. ధర్మార్థ కామమోక్షాణాం ఉపదేశ సమన్వితమ్. పూర్వయుక్త కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే॥ ఇత్యుక్త లక్షణే పురావృత్త ప్రకాశకే భారతాది గ్రంథే"– అని శబ్ద కల్పద్రుమము. వీనిని బట్టి ఇతిహాస

2. 'మధ్వాహుతయో హవా ఏతా దేవానాం యదనుశాసనాని విద్యా వాకోవాక్య మితిహాసపురాణం గాథా నారాశంసీ రిత్యహరహః స్వాధ్యాయ మధీతే'—శతపథ బ్రాహ్మణ. XI. 3.5 అధ్యా 8 బ్రా.
3. 'పురాణభవ మితి పురాణమ్ (అమరకోశము) 'పురా పూర్వస్మిన్ భూత మితి పురాణమ్' (గురుబాల ప్రబోధిక) 'పురాభవ మితి పురాణమ్' (శబ్దకల్ప ద్రుమము).
4. 'పురా నీయతే ఇతి పురాణమ్' (వాచస్పత్యము).
5. 'పురా నవం భవతి పురాణమ్ (యాస్కనిరుక్తము).
6. 'యస్మా త్పురా హ్యనక్తీదం పురాణం తేన హి స్మృతమ్. నిరుక్త మస్య యో వేద సర్వపాపైః ప్రముచ్యతే' — వాయుపురాణము.
7. 'పురా పరంపరాం వష్టి పురాణం తేన హి స్మృతమ్' — పద్మపురాణము.
8. 'పురాతనస్య కల్పస్య పురాణాని విదు ర్బుధాః' — మత్స్యపురాణము.

10.

మనగా పురావృత్త మనియు, అది 'యిట్లు జరిగిన' దని పారంపర్యముగా చెప్పు
కొనుచున్న కథయై యుండవలె ననియు, అది చతుర్వర్గోపదేశ సమన్వితమై
యుండవలయు ననియు స్పష్టమగుచున్నది. ఇతిహాస పురాణములు రెండును
అథర్వ వేదాదులలో పేర్కొనబడి యున్నవి. వాని స్వరూప స్వభావములలో
భేద ముండి తీరవలెను. విద్యారణ్యులు సాయణ వేదభాష్యోపోద్ఘాతమున వాని
స్వరూపములను చక్కగా వివేచించి చూపినారు, 'దేవాసురా స్సంయత్తా ఆసన్'-
అని 'ఇట్లు పూర్వము జరిగిన దట' అనునట్లు పూర్వ ప్రసిద్ధవృత్తములను
తెలుపునది ఇతిహాస మనియు, 'ఇదం వా అగ్రే నైవ కించి దాసీత్'- ఇత్యాదిక
మగు జగత్ప్రాగవస్థ నుపక్రమించి చెప్పెడి వాక్యజాతము పురాణ మనియు
నిష్కర్ష చేసినారు[9]. అనగా వేదవాక్యములలోనే జగత్ప్రాగవస్థను గూర్చి
చెప్పెడి వాక్యములు పురాణము లనియు, దేవదానవ యుద్ధాది ప్రసిద్ధ విషయ
ములను చెప్పు వాక్యసముదాయము లితిహాసము లనియు తాత్పర్యము. దీనిని
బట్టి వేదవాక్యములందే పురాణేతిహాస స్వరూప స్వభావ వివేచనము మొదట
ప్రారంభ మైన దని భావింపవచ్చును. పురాణ మొక సాహిత్యప్రక్రియగా పరిణ
మించుట కిట్టి పర్యాలోచనము ప్రాతిపదిక యనవచ్చును.

పురాణ మొక సాహిత్యప్రక్రియగా అభివృద్ధి చెందుటచే దాని కొకలక్షణ
మేర్పడినది. 'పురాణం పంచలక్షణమ్' అనునది ప్రసిద్ధి కెక్కినది.

'సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వన్తరాణి చ
వంశానుచరితం[10] చేతి లక్షణానాం తు పఞ్చకమ్'

అనునది అమరసింహుని నిర్వచనము. ఈ సూత్రము ప్రాచుర్య మందుటకు
ఆ పంచలక్షణముల పరమసార్థక్యమే కారణము. పురాణమునకు సర్గవర్ణనము
ప్రథమలక్షణ మని పై సూత్ర నిర్దేశము. సర్గమందు బ్రహ్మాండోత్పత్తి చెప్ప
ఘును. పురాణము బ్రహ్మాండోత్పత్తినే మొదట ఎందులకు చెప్పవలెను?
చో తన పురాణనామమును సార్థక మొనర్చుకొనుటకే యని సమాధానము.
మున ప్రాచీనము, గతము అని అర్థముకదా! ఆగతము అద్యతన భూత

---

9: కావ్యాలంకార సంగ్రహము - శ్రీసన్నిధానము సూర్య
ణశాస్త్రి. పుట 263.

10 రితం - లేక - భూమ్యాదేః సంస్థానం - (పాఠభేదము).

మనియు, అనద్యతనభూత మనియు ద్వివిధము. అందు అనద్యతన భూతము యొక్క ఆదిమదశ పురాణము. అచ్చటినుండి అద్యతన భూతము వరకు గల గతము చరిత్ర లేక ఇతిహాసము. అనగా- ఒక పురావస్తువు యొక్క ఉత్పత్తిని గూర్చియు, తత్సృష్టి కారణమును గూర్చియు చెప్పెడి ప్రాచీనగాథ పురాణ మనబడవచ్చును. తద్విస్తరవికాసాదులనుగూర్చి వివరించుగాథ నాతిప్రాచీనము కానిచో ఇతిహాస మనవచ్చును. అట్లగుచో- పురాతత్త్వ జిజ్ఞాసువు లైన మనీషులు బ్రహ్మాండము యొక్క పుట్టుపూర్వోత్తరములను గూర్చి లోకమునకు చెప్పగడగిన గాథా విశేషమే సర్గము. అంతకంటె ప్రాచీనమైన వస్తువు సృష్టిలో కానరాదు. కావున పురాణ మచ్చటినుండి ప్రారంభ మగుటకంటె ఔచిత్యము మరొండు లేదు. అందువలననే 'ఇదం వా అగ్రే నైవ కించి దాసీత్' ఇత్యాదికం జగతః ప్రాగవస్థా ముపక్రమ్య సర్గప్రతిపాదకం వాక్యజాతం పురాణ మ్మని విద్యారణ్యులు పురాణ ప్రత్యేకతను ప్రతిపాదించి చెప్పుట.

సంస్కృతభాషలో భూతకాలిక క్రియలకు లఙ్ లుఙ్ లిట్ అను త్రివిధ లకారములు చేర్చి అద్యతన- అనద్యతన- ఆనంత భూతకాలికార్థములను తెలుపు చుండుట కలదు. అమరసింహుడు పురాశబ్దమునకు చిరాతీతనికటాగామికార్థములు కలవని పేర్కొనెను. ఇట్టి విభాగమునం దొక సామంజస్య మున్నది. మనకు ప్రస్తుతము. వర్తమానము. అది ప్రత్యక్షము. కొంతకాలము జరిగిన తరువాత ఆ విషయము వార్త యనబడును. మరికొంత కాలము గడచుసరికి అది పరం పరాకథన రూపమున వెలసి చారిత్రకవృత్త మనబడును. అదియే చిరకాల మైన తరువాత చెప్పబడినచో దాని చారిత్రకత్వముకంటె పురాతనత్వమే అధికముగా భాసించి పురావృత్త మనబడును. దీనిని జగత్కథ కన్వయించుచో సర్గాది పురాలక్షణ విశిష్టమైన వస్తువును నేడు పురాణ మనుటలో ఎట్టి విప్రతిపత్తియును లేదు. ప్రాచీన ప్రసిద్ధ రాజచరిత్రము లితిహాసము లని గ్రహించుటలో సంకోచ ముండదు. అమరసింహుని మాటలలో చెప్పినచో- చిరభూతార్థము పురాణము. అతీత భూతార్థము ఇతిహాసము. ఈ సత్యమును గుర్తించి భోజుడు 'అతీతార్థ ప్రాధాన్యా దితిహాసః'[11] అని పేర్కొనియున్నాడు.

సర్గము, ప్రతిసర్గము. వంశము, మన్వంతరములు, వంశానుచరితము అను పంచలక్షణములు కలిగినవి పురాణము లని అమరకోశము. వంశాను

11. సరస్వతీ కంఠాభరణము. 2. 368 శ్లో. వ

చరిత స్థానమున 'భూమ్యాదేః సంస్థాన' మ్మను పాఠాంతర మొండు కనబడు చున్నది. సర్గ మన ఆదిసృష్టి. ప్రతిసర్గ మన కల్పాంతమున జరుగు పునస్సృష్టి. దీనిని విసర్గ మనియు అందురు. అందు బ్రహ్మాదు లొనరించిన సృష్టి విధానమును, స్థావరజంగమాత్మక మైన సృష్టి వైవిధ్యమును విపులముగా వర్ణింపబడును. వంశములందు దేవాసుర విభేదోత్పత్తియు, బ్రహ్మర్షి వంశకర్తల చరిత్రములను వర్ణింపబడి సృష్టింపబడిన జీవరాసులలో ఏర్పడిన క్రమబద్ధమైన వికాసము సూచింపబడును. మన్వంతరములందు ధర్మశాస్త్ర ప్రవర్తకులై భువిని శాసించిన పదునలుగురు మనువుల యొక్క ఉత్పత్తియు, వారి పరిపాలన కాలము నందలి విశేషములును చెప్పబడును. అనగా- ఈ అంశమునందు వేద ధర్మము లోకమున ఆచరింపజేయుట కేర్పడిన విశిష్టసంస్థలవంటి మహావ్యక్తులను గూర్చిన కథలు కీర్తింపబడు నని భావము. వంశానుచరితమున దైవమూలములైన సూర్యచంద్ర వంశములందు జన్మించి ధర్మవీరు లయి ప్రసిద్ధి కెక్కిన మహారాజుల చరిత్రములు వివరింపబడును. సర్గ ప్రతిసర్గ వంశములలో సృష్ట్యారంభమును, వేదోత్పత్తియు, దేవదానవుల యుత్పత్తి వికాసములును వర్ణింపబడగా, మన్వంతర వంశానుచరితములయందు మానవజాతి వ్యవస్థయు, తత్పరిపాలనమును, తత్ప్రభువుల విధానమును తెలుపబడుచున్నవి. కావున పంచలక్షణ విశిష్టము లైన పురాణములు ప్రపంచోత్పత్తి వికాస క్రమమును ప్రదర్శించుటయే కాక వేదాది ధర్మములు దేవమానవ సంఘములం దనుష్ఠింపబడిన క్రమమును నిర్దేశించుచు వేదశాస్త్రేతిహాసాదులతో తమ ప్రత్యేకతను నిలుపుకొనినవి.

భారతీయులకు వలెనే బాబిలోనియనులకు గూడ పురాణవాఙ్మయ మున్నట్లు తెలియుచున్నది. అలెగ్జాండరునకు సమకాలికుడైన ఒక చరిత్రకారుడు 'కాల్డియనుల' చరిత్ర వ్రాసెనట! దాని పూర్వభాగమున అతడు బాబిలోనియనుల ప్రాచీన చరిత్రను వర్ణించుచు ఆ జాతివారికి వారి పురాణములపై నున్న శ్రద్ధాభక్తుల నుగ్గడించెను. దానివలన బాబిలోనియనుల నూటయేబది వేల సంవత్సరముల ప్రాచీన చరిత్రను తెలుపు లిఖిత గ్రంథములు భద్రముగా దాచబడియున్న వనియు, వానియందు స్వర్గాదులయొక్కయు, మహార్ణవముల యొక్కయు ప్రాచీనగాథలు వ్రాయబడియున్న వనియు, సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతరాదులకు తుల్యములైన లక్షణము లా గ్రంథములందు కానబడుచున్న వనియు తెలియ

వచ్చుచున్నది. అనగా బాబిలోనియనులు భారతీయుల వలెనే ప్రాచీనములును పంచలక్షణ ప్రధానములును అయిన పురాణములను కలిగియుండి రనుట స్పష్టము.[12] 'పురాణం పంచలక్షణమ్' అను సూత్రము ప్రపంచమునందు వెలసిన ప్రాచీన జాతులయొక్క పురాణ వాఙ్మయమున కంతటికిని అన్వయించు విశ్వజనీన మైన విశిష్ట నిర్వచన మనవచ్చును.

పురాణ శబ్దమునకు 'పురాఽపి నవమ్ పురాణమ్' అను నిరుక్తి యొకటి ప్రసిద్ధి కాంచినది. దీనినిబట్టి పురాణములం దభివర్ణింపబడు వస్తువిశేషములు పురాతనము లయ్యును నవ్యములుగను, నిత్యనూతనములుగను భాసించుచుండు నని తాత్పర్య మేర్పడుచున్నది. పురాణములందలి ఈ నవ్యతయే వీనికి ఉత్తమ సాహిత్య గౌరవము నాపాదించుచున్నది. పురాణములందలి వస్తువు పురాతన మయ్యును అవి రచింపబడిన కాలమునుబట్టి అర్వాచీనములుగా పొడగట్టుచున్నవి కావున నవ్యము లనబడుచున్న వని ఈ నిరుక్తికి కొందరన్వయము చెప్పుచున్నారు. అట్లైనను పురాణమన అతిప్రాచీన మైన దనెడి పూర్వనిరుక్తుల తాత్పర్యమున కెట్టి విప్రతిపత్తియు ఏర్పడుట లేదు; కాని పురాణములు ప్రప్రథమమున పురాగాథాస్వరూపములై యుండినను క్రమముగా వానియందు అర్వాచీనములైన వస్తు విశేషము లెన్నియో చేరుచు వచ్చిన వని స్పష్టమగుచున్నది.

మహాపురాణములలో భవిష్య పురాణము కలదు. అందు భవిష్యత్కాలమున ప్రవర్తిల్లు అంశములు కూడ పురాణము పేర నిబంధింపబడి యున్నవి. దీనిని బట్టి కాలక్రమమున ప్రాచీనార్వాచీన విషయ సంఘాతమే కాక భవిష్యత్కథార్థములుకూడ పురాణములందు చేర్పబడిన వని విమర్శకులు భావించుచున్నారు.[13] దీని కుపబలకముగా అమరసింహుడు తన అమరకోశమున 'పురా' శబ్దమునకు 'స్యాత్ప్రబంధే చిరాతీతే నికటాగామికే పురా' అని నానార్థముల నిచ్చియున్నాడు. దీనిని బట్టి క్రీ. శ. 4 వ శతాబ్దికి పూర్వమే పురాశబ్దమునకు ఆసన్న భవిష్యదర్థముకూడ రూఢి కెక్కిన దని స్పష్టమగుచున్నది. పురాశబ్దమునకీ నానార్థముల నేర్పరచుటచే అమరసింహుడు భవిష్యపురాణ మను సమాసమునందలి అనన్వయమును తొలగించి పుణ్యము కట్టుకొనెను.

12. The Matsya Purana – A Study. పుట. 18—19
13. History of Dharma Sastra – Vol. V. పుట 855.

పురాణములు పంచలక్షణములతో ఆగలేదు. భారతీయ జిజ్ఞాసువులు తమ మనోబుద్ధులు ప్రసరించినంత మేరకు విజ్ఞానమును సేకరించి పురాణములందు నింపి, వానిని భారతీయ విజ్ఞాన సర్వస్వములుగా తీర్చిదిద్ద యత్నించిరి. భారతీయ ధర్మము, హిందూమతము అన్యమతస్థుల దాడులకును, హింసాకాండలకును బలియైపోకుండ రక్షించుటకై వేద ధర్మమునకు సంబంధించిన సమస్త విజ్ఞాన విషయ సముదాయము నేకత్ర సంతరించి సంరక్షింపవలెనను సముద్దేశముతో ప్రాచీనులు ప్రజాదరణమున కత్యంతపాత్రము లైన పురాణములలో వీలైనప్పుడెల్ల తమజాతియొక్క సారస్వత ధనములను నిధులుగా నిలుపుచు వచ్చిరి. దానన్రవత భక్తియోగాది విషయములును, వేదాంతము, వైద్యము, సంగీతము, జ్యోతిషము, శిల్పము,గణితము, వ్యాకరణము, ఛందోఒలంకారములు నాట్యము, రాజనీతి, సాంఘికనీతి, మొదలగు బహుశాస్త్రాంశములు పురాణచ్ఛత్రము క్రింద తలదాచుకొనినవి. ఇట్లు వరదలుగా వచ్చిపడిన వివిధాంశములతో పురాణములు బృహత్తర సారస్వత గ్రంథములుగా విశ్వరూపము తాల్చినవి. ఇట్లనుటచే ప్రతి పురాణమునందును పైన పేర్కొనిన సర్వాంశము లుండునని కాదు. కొన్నింటియందు కొన్ని యుండును. మరికొన్నింటియందు మరికొన్ని యుండును. పురాణవాఙ్మయమును సమష్టిగా పరిశీలించినచో అన్నియు దానియందుండును.

పురాణములందు వివిధ శాస్త్రాచారాది విధులకు సంబంధించిన విషయ సంఘాత మధికముగా చేరుటవలన ప్రాచీనము లైన పంచలక్షణముల కున్న స్థానము నానాటికి కుంచించుకొని పోయినది. కొన్నింట అస్తినాస్తి విచికిత్సకు విషయ మైనది. చరిత్రకారుల అభిప్రాయములో మహాపురాణములు క్రీ.శ. 5,6 శతాబ్దులకు పూర్వమే వెలసియున్నవి. మత ప్రచారమునకు పురాణములు ఉత్తమ సాధనములుగా గుర్తింపబడినవి. దానికితోడు భారతీయ మతక్షేత్రమున తల లెత్తిన శైవ వైష్ణవాది మతములు ఆవేశమూర్తులై తమ కనాదిత్వగౌరవ మాపాదించు కొనుటకును, వేదప్రామాణ్యమును సిద్ధింప జేసికొనుటకును ప్రత్యేక పురాణములనే వినిర్మింప నారంభించినవి. దానితో మహాపురాణములతోపాటు ఉప పురాణముల యుత్పత్తియు ప్రారంభమైనది. క్రీ.శ. 7 లేక 8వ శతాబ్దినుండి 18వ శతాబ్దివరకు ఉపపురాణము లధికసంఖ్యలో వెలువడినవి.

ఈ పరిణామ దశలో పంచలక్షణ సూత్రము ఉప పురాణములకు సంబంధించిన దనియు, మహాపురాణములు దశలక్షణ, దశాధికలక్షణ విశిష్టము లనియు సిద్ధాంతము ప్రాచుర్యమునకు వచ్చినది. భాగవత మహాపురాణము పంచలక్షణ సూత్రము ఉపపురాణములకు వర్తించు ననియు, మహాపురాణము దశలక్షణ సమన్విత మనియు పేర్కొనినది. ఆ పురాణము పంచలక్షణములతో పాటు వృత్తి, రక్ష, సంస్థ, హేతువు, అపాశ్రయము అను అయిదు లక్షణములను క్రొత్తగా ప్రతిపాదించినది.[14] భగవత్తత్త్వ ప్రతిపాదక మైన ఈ పురాణము దశలక్షణ సూత్రమును పరబ్రహ్మానుసంధాన దృష్టితో నిర్మించినది. ఘటాది పదార్థములందు మృదాదిద్రవ్య మెట్లు భాసించునో అట్లే పరమాత్మరూపనామము లందును ఆజన్మ మరణాంతములైన అవస్థలయందును అన్వితానన్వితమై యొప్పుచుండె ననియు, చిత్తము తనంతట తానుగాని అనుష్ఠితయోగము వలన గాని వృత్తిత్రయమును పరిహరించి విరతి నొందునప్పుడు సంసారప్రవృత్తి నివృత్తుడై అత డాత్మ సాక్షాత్కారము కాంచు నను పరమతాత్పర్యము పురాణము బోధింపవలె నని భాగవతమతము. తదనుగుణముగా పై పది లక్షణముల నాపురాణము నిర్దేశించినది. మన్వంతర వంశ వంశానుచరితములు కూడ తత్పరమార్థమును బోధించుచుండ వలె నని ఆ పురాణతాత్పర్యము కానోపును. ఇతర పురాణములయం దీ తాత్త్విక సమన్వయ మంతగా కానరాదు.

భాగవత పురాణమువలెనే బ్రహ్మవైవర్తము కూడ పంచలక్షణసూత్రము ఉప పురాణములకు మాత్రమే అన్వయించు నని చెప్పుచు మహాపురాణములకు దశాధిక లక్షణము లుండునట్లు పేర్కొనెను. సృష్టి, విసృష్టి, స్థితి, జగత్పాలనము, కర్మవాసన, మనుప్రకాశక్రమము, ప్రళయవర్ణనము, మోక్షనిరూపణము, హరినామ సంకీర్తనము, వివిధ దేవతల విశిష్ట గుణవర్ణనము మొదలగునవి మహాపురాణలక్షణము లని బ్రహ్మ వైవర్త పురాణ మతము.[15] మత్స్య పురాణము ప్రసిద్ధ పంచలక్షణములే కాక బ్రహ్మ విష్ణ్వర్క రుద్రుల మాహాత్మ్యమును, భువన విస్తార మాహాత్మ్యములును, తత్ సంహార ప్రదానములును, పురుషార్థ చతుష్టయ ప్రతిపాదనమును, పురుషార్థ సాధన వైముఖ్యము వలన కలుగు విరుద్ధ ఫలములును, దాన ధర్మవిధులును, శ్రాద్ధకల్ప విధులును, వర్ణాశ్రమ ధర్మములును.

14. భాగవతము. XII. 7. 8 - 10; 11 - 21.

15. బ్రహ్మవైవర్త పురాణము - శ్రీ కృష్ణజన్మఖండము. 132 అధ్యా.

దేవతావిగ్రహ ప్రతిష్ఠాపన విధులును, సర్వపురాణ వర్ణనీయాంశములుగా పేర్కొనెను,[16] భాగవతమువలె మాత్స్యము పంచలక్షణ సూత్రమును ఉప పురాణములకు మాత్రమే పరిమితము చేయలేదు. తాను చెప్పిన దశాధిక లక్షణములు సర్వపురాణ సామాన్యము లని పేర్కొనినది. ప్రపంచ జీవప్రవృత్తి యంతయు అర్థ చతుష్టయ సాధనాత్మకమై యుండ తత్సాధన విధాన పరమార్థమును బోధించు సరస సారస్వతాదర్శ స్వరూపములు పురాణము లని మాత్స్య ముపలక్షించినది.

కుమారిలభట్టు తన తంత్రవార్త్తికమున పురాణప్రశంస చేయుచు అవి పురుషార్థ సాధనోపయోగము లని సమన్వయించి ప్రపంచించి యున్నాడు. స్మృతులకు ప్రామాణికత్వము పురాణములచే ప్రతిష్ఠాపిత మగును. అందలి ధర్మ మోక్ష సంబంధ మైన యావద్విషయము వేదప్రభవము; అర్థసుఖ విషయ మంతయు లోకవ్యవహార పూర్వకము. ఇట్లు స్మృతిస్థము లైన విషయములను వివేచించి తెలియవలెను. ఇదేవిధముగా పురాణేతిహాసము లందలి ఉపదేశ వాక్యముల నెఱుంగవలెను. అందలి ఉపాఖ్యానముల నర్థవాదములచే వ్యాఖ్యానింపవచ్చును. కించిద్దర్శన పూర్వకమును, కించిద్వేద మూలమును అయిన పృథివీ విభాగాది కథనము తద్ధర్మాధర్మ సాధన ఫలోపభోగ ప్రదేశ వివేచనార్థ ముపయోగపడును. దర్శన స్మరణమూల మైన వంశానుక్రమ వర్ణనము బ్రాహ్మణ క్షత్రియజాతి గోత్రజ్ఞానార్థమును, దర్శన గణిత సంప్రదాయానుపూర్వక మైన దేశకాల పరిమాణ కథనము లోకజ్యోతి శ్శాస్త్ర వ్యవహార సిద్ధ్యర్థమును, వేదమూల మైన భవికథనము అనాదికాల ప్రవృత్త యుగస్వభావ ధర్మాధర్మానుష్ఠాన ఫలవిపాక వైచిత్ర్య జ్ఞానార్థమును పురాణములందభివర్ణితము లగుచుండెనట! ఈ సమన్వయమునుబట్టి లోకవేదప్రభవములైన ధర్మాదుల నభివర్ణించుటచే పురాణములు లోకమునకు పురుషార్థ పరిజ్ఞానము నందించుటకేర్పడిన వని స్పష్టమగుచున్నది.

లోకమున పరమాస్తిక్య బుద్ధిని పోషించునవి పురాణములు. వీనియందు సగుణ నిర్గుణోపాసనము కలదు; అవతార వర్ణనము కలదు. ఋషిదేవ పితృ రూపము లగు నిత్యశక్తుల మహిమ యున్నది. చివరకు భూతప్రేతాదుల నికృష్టోపాసనయు కలదు. దానధర్మ వ్రతతీర్థ మహిమాభి వర్ణనము కలదు.

16. మాత్స్యపురాణము. 2.22 - 24; 53. 65—67.

ఇట్లు పురాణములందు సర్వవిధ చిత్తవృత్తుల కానందము కలిగించెడి అర్థసమూహముల సమావేశము కలదు. బాలురనుండి వృద్ధులవర కేవయస్సువా రైనను, ఎట్టి యవస్థయందు రైనను చదివి, విని ఆహ్లాదము నొందగలిగెడి విషయము ఉండుటచే పురాణ వాఙ్మయము మానవ జీవితరంగ మంతటిని ఆవరించియున్న విశ్వవిజ్ఞానరూప మై అలరారు చున్నది.

కల్పనా మధురము లైన విచిత్ర కథలు, గాథలు, చరిత్రలు, ఉపాఖ్యానములు, స్తుతులు, మంత్రములు, తంత్రములు పురాణములు వర్ణించి చెప్పుచున్నవి. శిల్పకావ్య సాహిత్యాలంకార వ్యాకరణాది శాస్త్రములలోని రహస్యములను, పురాతన సామాజిక, రాజకీయ, నైతిక, మత, ధార్మికాచార వ్యవహారములను పురాణములు ప్రతిపాదించుచున్నవి. శుష్కధర్మోపదేశములను కావ్యరసభావములతో రంగరించి సామాజికులకు ఆస్వాద యోగ్యము లొనర్చి, పురాణము ఉత్తమ సాహిత్య గౌరవ మందుటతో పాటు, తదితర కావ్యప్రక్రియలకు వస్తుదానమును, అర్థదానమును, జ్ఞానభిక్షను ఒసంగి పోషించుచున్నవి.

పురాణము సర్వ సాహిత్య ప్రక్రియలకు మాతృభూమి యని నారదీయపురాణము అభివర్ణించినది.

'పురాణ పురుషాజ్జాతం యథేదం జగదద్భుతమ్
తథేదం వాఙ్మయం జాతం పురాణేభ్యో న సంశయః'.

పురాణ పురుషుని నుండి బ్రహ్మాండ మె ట్లుద్భవించినదో సర్వవాఙ్మయజగత్తు పురాణమునుండి పునర్భవించిన దని పురాణ తాత్పర్యము. ఇతిహాసము, ఉపాఖ్యానము, కథ, స్తుతి మొదలైన సాహిత్య ప్రక్రియల నన్నింటిని పురాణము తనలో నిమిడ్చుకొనినది. మహాకావ్యములకు వస్తుసంపత్తిని ప్రసాదించినది.

'య న్నదృష్టం హి వేదేషు తత్సర్వం లక్ష్యతే స్మృతౌ
ఉభయో ర్య న్నదృష్టం హి త త్పురాణైః ప్రణీయతే'.

శ్రుతిస్మృతులందు కానరాని సర్వధర్మాంశములు పురాణములు బోధించుచున్న వని నారదీయ మహాపురాణము చెప్పిన వాక్యమును గమనించినచో మన ప్రాచీనులు పురాణముల నెంతటి ఉదాత్తసాహిత్యమూర్తు లుగా భావించిరో తెలియ

గలదు. అందువలననే వారు వేదములవలె పురాణములను పరమప్రమాణము లుగా పరిగణించిరి. పంచమవేదములని పురాణములను ప్రశంసించిరి; కంఠస్థము చేసిరి; శిష్యులకు బోధించిరి; పర్వదినములలో శ్రోతలకు వినిపించిరి; వ్యాఖ్యానములను వ్రాసిరి; ప్రాణప్రదముగా రక్షించిరి: భావితరములవారికి అక్షయనిధులుగా అందించిరి.

పురాణ రచనము, పురాణప్రవచనము, పురాణశ్రవణమననములు భారతీయసంస్కృతిలో ఒకభాగ మై పోయినవి. పురాణకర్తలకు వేదవ్యాసుని కిచ్చెడి గౌరవము లభించును. గుడి యున్న ప్రతిగ్రామములో పర్వదినములలో పురాణపఠనశ్రవణ మొక పుణ్యకార్యముగా తలంపబడినది. రక్తితో పాటు ముక్తిని ధర్మాభిరతిని జాతిలో పునరుజ్జీవింపజేయు విశిష్టవాఙ్మయ యజ్ఞవిశేషము పురాణప్రవచనము. తెలుగునాట వేదప్రవచనములు, పురాణప్రవచనములు వృత్తిగా గ్రహించిన కుటుంబములు కలవు. వారి కావృత్తులు గృహనామములుగా నిలిచిపోయినవి. వేదమువారు, పురాణమువారు, భాష్యమువారు- ఇట్లెన్నో గృహనామములతో విలసిల్లిన పండిత కుటుంబములు నేటికిని కానవచ్చుచున్నవి. పురాణపఠన ప్రవచనము లొకకళగా నేటికిని గౌరవింప బడుచున్నవి. పురాణము భారతదేశమున ప్రజావాఙ్మయముగా వెలసిన దనుట కివియన్నియు భౌతిక నిదర్శనములు.

పురాణములు మహాపురాణము లనియు, ఉపపురాణము లనియు రెండు విధములుగా కనవచ్చుచున్నవి. బ్రహ్మపురాణాదు లగు పదునెనిమిది మహా పురాణములును, సనత్కుమారీయాదు లగు ఉపపురాణములు పదునెనిమిదియు ప్రసిద్ధములు. అందు మహాపురాణము లివి. — 1. బ్రహ్మపురాణము. 2, పద్మ పురాణము. 3, విష్ణుపురాణము. 4. వాయుపురాణము. 5. భాగవత పురాణము 6. నారదీయపురాణము. 7. మార్కండేయ పురాణము. 8. అగ్ని పురాణము 9. భవిష్య పురాణము. 10. బ్రహ్మవైవర్త పురాణము. 11. వరాహ పురాణము 12. లింగ పురాణము. 13. స్కాంద పురాణము. 14. వామన పురాణము. 15. కూర్మ పురాణము. 16. మత్స్య పురాణము. 17. గరుడ పురాణము 18. బ్రహ్మాండ పురాణము. కొన్ని పురాణములు వాయు పురాణమునకు బదులు శివ పురాణమును, భాగవత పురాణమునకు బదులు దేవీభాగవతమును పేర్కొని

నవి. దేవీ భాగవతము అష్టాదశ మహాపురాణముల నామాద్యక్షరములను కూటములుగా చేర్చి సూత్రప్రాయ మైన ఒకచక్కని శ్లోకమును ప్రసాదించినది.

'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ' త్రయం 'వ' చతుష్టయమ్
'అ' 'నా' 'ప' 'లిం' 'గ' 'కూ' 'స్కా' 'ని' పురాణాని పృథక్ పృథక్.

పురాణ నామకథన మొనర్చునప్పు డెల్ల పండితు లీశ్లోకమును పఠింతురు.

మహాపురాణము లన్నియు వేదవ్యాస ప్రోక్తము లని భారతీయ విశ్వాసము, బ్రహ్మముఖ వినిర్గతము లైన వేదములను వ్యాసు డెట్లు విభజించెనో అట్లే మొదట బ్రహ్మప్రోక్త మైన పురాణ సంహితను అష్టాదశ మహాపురాణములుగా వినిర్మించె నని పరంరగా వినవచ్చెడి సంప్రదాయము. వేదము లపౌరుషేయము లనియు, పురాణము లార్ష ప్రోక్తము లనియు ప్రసిద్ధి. చారిత్రక విమర్శకు లీయంశములపై భిన్నాభిప్రాయములను వ్యక్తము చేసినను సంప్రదాయమును సాధికారముగా నమ్మెడి విద్వాంసు లెందరో యున్నారు.

అష్టాదశ మహాపురాణములవలెనే అష్టాదశోపపురాణములు కల వని పారంపర్యముగా చెప్పబడుచున్నది. అవి.— 1. సనత్కుమారీయము. 2. నారసింహము. 3. నాందము. 4. శివధర్మము. 5. దౌర్వాసము. 6. నారదీయము. 7. కాపిలము, 8. వామనము. 9. ఔశనసము. 10. మానవము. 11. వారుణము 12. కల్కి. 13. మాహేశ్వరము. 14. సాంబము. 15. సౌరము. 16. పారాశరము. 17. మారీచము. 18. భార్గవము. ఈ ఉపపురాణ సంఖ్యనుగాని, వాని క్రమమునుగాని తెలిపెడి పురాణములందు ఏకవాక్యత లేమిచే వీనిసంఖ్యా క్రమ నిర్దేశము దుష్కర మగుచున్నది.

ఉప పురాణముల ప్రశంస మత్స్యాది మహాపురాణములందును కానవచ్చుచున్నది. మాత్స్యము నారసింహ నంద్యాదిత్యసాంబ పురాణములను నాలుగింటిని ఉపపురాణములుగా పేర్కొనెను. కూర్మపద్మ దేవీభాగవతాదులు అష్టాదశోప పురాణములను పేర్కొని యున్నవి కాని వానియందు నామసామ్యము కానవచ్చుట లేదు. అట్లగుటచే ఆ పురాణ వాక్యములన్నియు క్రోడీకరించి చూచినచో ఉప పురాణములు పదునెనిమిదికంటె మించి యున్నవని బోధపడుచున్నది. స్కాంద ముపపురాణము లొకలక్ష కల వని తెలిపినది. ఉపపురాణములపై పరిశోధనము సలిపి. విలువైన వ్యాసములను 'Studies in Upapuranas' అను గ్రంథ

మును రచించిన ప్రొఫెసరు హజ్రా ఉపపురాణములను ఒక నూరింటిని పేర్కొ నెను. వానిలో చాలవరకు తాళపత్ర గ్రంథములే. ప్రచురితము లై ప్రసిద్ధి కెక్కి నవి చాల తక్కువ. ఏమైనను పురాణవాఙ్మయము అసంఖ్యాకముగా వెలసిన ఉపపురాణములతో అనంత విస్తృతి కాంచె ననుట తథ్యము.

ముద్రితోపపురాణములను పరిశీలింపగా వానియందు మహాపురాణముల లోని అనేకాంశములు యథాతథముగా గ్రహింపబడినట్లు తెలియుచున్నది. భాగవ తాదులు పేర్కొనినట్లు పంచలక్షణసూత్ర మీ ఉపపురాణములకు అన్వయించు నేమో యని చూడ అదియు కానవచ్చుట లేదు. కొన్ని ఉపపురాణములు మహా పురాణనామముల తోడనే వెలసినవి. స్కాందము, వామనము, నారదీయము మొదలైన వట్టివి. వీనిలో శైవవైష్ణవ మత ప్రతిపాదకములే కాక సౌర శాక్త గాణాపత్యాది మత ప్రబోధకము లైనవి కూడ కలవు. ఉపపురాణములు స్కాందాది మహా పురాణములందు వర్ణింపబడిన దాన వ్రత తీర్థ మాహాత్మ్యాదిక ములనే ప్రధానముగా గైకొని వర్ణించినవి కాని, వానికంటె వినూత్నము లైన కొన్నిగాథలనుకూడ కల్పించి పెంచినవి.

ఉపపురాణములు మహాపురాణములయొక్క ఉపభేదము లనియు, వాని యందు చెప్పక విడిచిన ధర్మాదు లిందు ప్రవర్తిల్లుచున్నవనియు మాత్స్యము చెప్పుచున్నది. ద్విజులు కొందరు ఆయాకాలములందు మహాపురాణములను పఠించి తత్సారసంగ్రహరూపములుగా ఉపపురాణములను కల్పించి రని కూర్మ పురాణము అనుచున్నది. ఇవి మహాముని విరచితము లనుటచే వ్యాసప్రోక్తములు కా వని తెలియుచున్నది.అందువలననే మహాపురాణ శ్లోకసంఖ్యలో వీని శ్లోకసంఖ్య గణింపబడలేదు. ఉపపురాణ మైన సౌరపురాణము, ఉపపురాణములను ఖిలము లని గర్హించుటచే ఉపపురాణములకు మహాపురాణముల ప్రామాణ్య మున్నట్లు కానరాదు.

భారతీయుల పురాణవాఙ్మయములకు తుల్యమైనది పాశ్చాత్యుల మైథాలజీ (Mythology). వారికి మనకువలెనే ఆ సాహిత్యప్రక్రియపై ప్రగాఢగౌరవాదర ములు కలవు. 'ఒకజాతియొక్క సంప్రదాయములనుబలపరచుటకు మిత్ (Myth) పుట్టును. చరిత్ర కందని పురావృత్తమును సముజ్జ్వలాధ్యాత్మికదృష్టితో సముద్ధ రించి, వ్యాఖ్యానించి, జాతియొక్క గౌరవప్రతిష్ఠల నినుమడింపజేయుట మైథాలజీ

లక్ష్యము. మైథాలజీ సర్వవాఙ్మయమునకు మూలభూత మైనది. అందుండియే ఇతిహాసము, కావ్యము, నాటకము సర్వము జనించును. మైథాలజీ మానవ సంఘవ్యవస్థను శాసించును; ధర్మమును బోధించును; న్యాయమును సూచించును. శిల్పసుందర మైన కళయును, జ్ఞానబంధుర మైన శాస్త్రమును దానివాక్కున భాసించును కావున మానవుని అనుభూతులకును, ఆవేశములకును, ఆశలకును, అంతరంగమునకును, అన్వేషణమునకును మైథాలజీ యొక మణిదర్పణము వంటి' దని పాశ్చాత్యుల అభిప్రాయము.[17]

పాశ్చాత్యులు భారతీయుల వేదపురాణేతిహాసములను కలిపి ఉమ్మడిగా Myths అని గుర్తించియున్నారు. కాని, భారతీయులు శ్రుతిస్మృతులను శాస్త్రములకంటె విలక్షణ మైన సాహిత్యప్రక్రియలుగాను పరిగణించెదరు. కావున పాశ్చాత్యులు చెప్పిన Myth యొక్క స్వరూపస్వభావములలో భారతీయుల వేదముల కేవి వర్తించునో, పురాణేతిహాసముల కేవి వర్తించునో వివేచింపవలసి యున్నది.

ప్రతిపాద్యాంశములనుబట్టి Myths-Explanatory Myths అనియు, Aesthetic Myths అనియు రెండువిధములు అని C. M. Gayley ప్రతిపాదించెను.[18] విశ్వవిశ్వాంతరాళములలోని మహాద్భుతవిషయములనుగూర్చియు, జీవితవిశేషానుభవములను గూర్చియు, విస్మృత మత సాంఘికాచారములను గూర్చియు, పురావిషయముల సార్థక చరిత్ర నిరూపణమును గూర్చియు అనాది మానవుల కున్న ఆసక్తిని తీర్చుటకై సత్యాన్వేషణపరు లైన కొంద రొనరించిన ఊహాపోహలలో రూపుదిద్దుకొనిన కథలు Explanatory myths. వానియందు ప్రపంచసృష్టి, మానవసృష్టి స్థితి వికాస ములు, దేవాసుర ప్రవృత్తులు, మృత్యువు, పరలోకములు, ఆచార వ్యవహారములు, పండుగ పబ్బములు-ఇట్టివానిని గూర్చిన జిజ్ఞాసయే కథలుగా, గాథలుగా అల్లుకొని కానబడును.

అహ్లాదమే పరమ ప్రయోజనముగా నిర్మింపబడిన అపూర్వకల్పనా మహనీయగాథా ప్రపంచము Aesthetic Myths అని అందురు. ఈ కథల యందు అపూర్వ విజ్ఞాన విశేషము లెన్నియో చెప్పబడును. కాని. వానివలన అహ్లాదముకంటె వేరొక ప్రయోజనము కానరాదు. అందలి పాత్రలును, వాని

17. చూడు Mythology - Ency. Britanica.
18. The Classic Myth - పుట -431.

మనోభావములును, సన్నివేశములును మానవ సహజానుభవములకు దూరమై యున్నను అవి భావనా మధురములై అబాలగోపాలమునకు చవులూరించు చుండును. పఠితలు వానివలన పొందెడి అమందానందమునకు ఆకథా మాధుర్యమే పరమ కారణము.

Aesthetic Myths లో చారిత్రకాంశము లాధారముగా వెలసినవి కొన్నియు, కేవల కల్పనాకథలు కొన్నియు కానవచ్చుచుండును, ఇట్టి భేదమును పురస్కరించుకొని Aesthetic Myths ను Historical Myths అనియు Romantic Myths అనియు విభజించుట యైనది. చారిత్రకాంశము నొకదాని నాధారముగా గొని దాని కొక దివ్యవాతావరణమును, సాహసాత్మక కథాస్వభావమును, భావనాబంధురము లయిన కల్పనలు జోడించి ఒకమిశ్రకథామూర్తిగా రూపొందింపబడినది Historical Myth అనబడును. దీనియందు బలీయమైన విధిప్రభావము సర్వకథాజీవితమును శాసించుచున్నట్లు చిత్రింపబడుట గమనింపదగిన ముఖ్యాంశము. Romantic Myth ఒకమహావీరుని ఉజ్వల చరిత్రము నభివర్ణించు కథ. అందు సన్నివేశములకంటె కథానాయక పాత్ర చిత్రణమునకే ప్రాముఖ్య మీయబడును. అతని ఆలోచనముల యొక్కయు, నిర్ణయముల యొక్కయు గతి ననుసరించి సర్వకథా ప్రవృత్తి పరిభ్రమించుట ఈ కథలలోని ప్రత్యేకత.

పాశ్చాత్యులు Mythsను వివేచించినవిధమును పురాణకథల కన్వయింప చేసినచో వానిలోని సర్గప్రతిసర్గ వృత్తాంతములు Explanatory Myths అనియు, మన్వంతర వంశానుచరితములు Aesthetic Myths అనియు స్థూలముగా ఏర్పరుపవచ్చును. అందును - వంశానుచరితములందలి ఐతిహాసిక మహాపురుషుల చరిత్రలు Historical Myths అనియు, మన్వంతరగాథాదులను అవతార మహిమాదులను Romantic Myths అనియు, భావింపవచ్చును. ఇట్టి విభాగము ప్రాచ్య విమర్శ పద్ధతిలో లేదు. కాని, నవ్యులు పాశ్చాత్య విమర్శన పద్ధతుల ననుసరించి పురాణకథల నిట్లు వర్గీకరించు చున్నారు,

కావ్యప్రక్రియ లన్నింటిలో పురాణము కల్పనకు కల్పవృక్షము వంటిది. వేదార్థములను త్రివిధ భాషలలో ప్రతీకాత్మకముగా కల్పించుటయం దాసాహిత్య శక్తి నాన్యతో దర్శనీయము. స్థావరజంగమాత్మక మైన జగత్తంతయు పురాణ-

కథాజగత్తునందు చిత్రవిచిత్రము లైన అవతారముల నెత్తి అపూర్వ సత్యము లకు అమూల్య ప్రతీకలుగా జీవించుచు వ్యాఖ్యానించు చుండును. అట్టికల్పనా మహనీయగుణమే కావ్యములకు వస్తుప్రదానమునమ చేసెడి మహత్వమును కల్పించినది. దేశీయ భాషాసాహిత్యములకు ఆచార్యపీఠమును సంతరించి పెట్టినది.

సంస్కృత సాహిత్యమున వెలసిన పురాణములు క్రమముగా ప్రాంతీయ భాషలయం దనువదింపబడ సాగినవి. దేశీయసారస్వత రంగములపై అవి ప్రధాన భూమికలను నిర్వహించినవి. 'It would be difficult to exagerate popularity and importance of the religious poems known as Puranas. They are very widely used among the common people both in the original and numerous vernacular versions and adaptions. Indeed the Epics and Puranas are the real Bible of the common people whether literate or illiterate and they are the source of half the vernacular literature''[19] అని Farqularనుడివిన పలుకులు ఇచ్చట స్మరణీయములు,

# 2

సంస్కృతవాఙ్మయమున వేదధర్మమును ప్రపంచించు పురాణము లొకవైపు ప్రసిద్ధి చెందగా మరియొకవైపు జనధర్మమును ప్రబోధించు పురాణ ములు వెలసినవి. వాని ప్రభావముకూడ దేశీయభాషాసాహిత్యములపై కలదు కావున జైనపురాణవివేచనము చేయనిదే పురాణవాఙ్మయస్వరూపవిచారము సమగ్రము కాదు.

ఆర్షసంప్రదాయ విరుద్ధము లైన జైనబౌద్ధములు ప్రజాదరణపాత్రము లగుటకు అనువైన సాహిత్యప్రక్రియల నన్వేషించినవి, మతవ్యాప్తికి పురాణములు శక్తిమంతము లైన సాధనములుగా ఆమతస్థులకు కానవచ్చినవి. కాని వేదో పనిషత్తాత్పర్యములకును, షడ్దర్శనసిద్ధాంతములకును ప్రతీక లైన సర్గప్రతి సర్గాది లక్షణముల కాకరము లైన వైదికపురాణములవిధము వారి కంగీకారము కాలేదు. బౌద్ధు లవతారగాథలకు ప్రతిగా జాతకకథలను సృష్టించి బుద్ధదేవుని

19. An outline of the Religious Literature of India - పుట 136.

మహిమలు వర్ణించిరి. అవి ప్రజలహృదయముల నాకర్షించినవి. జైనులు బౌద్ధులకంటె విలక్షణమైన మార్గము ననుసరించిరి. వారు పురాణాఖ్యను గ్రహించి జైనపురాణములను వెలయించిరి. సంస్కృతపురాణములవలె వానిని పంచలక్షణ విశిష్టములుగా రూపొందించిరి. కాని ఆ పంచలక్షణములు సర్గప్రతిసర్గాదులు కావు. జైనమతసంప్రదాయానుకూలము లైన పంచలక్షణములవి. వారు అంతటితో ఆగిపోలేదు, ప్రసిద్ధ సంస్కృతేతిహాస పురాణ కావ్యగాథలను జైనమతాను గుణముగా మార్చి వినిర్మించిరి. వానిలో కొన్నింటిని తమ పురాణములందు వస్తువులుగా గ్రహించిరి. బౌద్ధులు బుద్ధుని జన్మగాథలు జాతకకథలలో వర్ణింపగా జైనులు తీర్థంకరుల జన్మమహిమాదికములను దెల్పుకథలను పురాణవస్తువులుగా గ్రహించిరి. ఇట్లు జైనులు మహాపురాణ సంప్రదాయముకంటె భిన్నమైన ఒక పురాణరచనా సంప్రదాయమును రూపకల్పన చేసికొని, దానియందు పురాణ రచనా వ్యాసంగములను నిర్వహించి పురాణసాహిత్యమునం దాసక్తమైయున్న ప్రజాహృదయములను ప్రచ్ఛన్నముగ కొల్లగొట్టి మతప్రచారము సాధించిరి.

ప్రాచీన పురాణ సంప్రదాయమున పరతత్త్వమునకును, వేదతాత్పర్య మునకును, భగవల్లీలలకును, అవతారగాథలకును ప్రాధాన్యము లభింపగా నవీనమగు జైనపురాణ సంప్రదాయమున మతప్రబోధమునకును, మతాచార్య మహిమాభివర్ణనమునకును, ఆచార్య పూర్వజన్మగాథలకును, ప్రాచీనసమకాలీన భక్త చరిత్రలకును పట్టాభిషేకము చేయబడినది. కేవలజ్ఞానసిద్ధిచే ముక్తు లైన తీర్థంకరుల జన్మమహిమాది విశేషములను ప్రతిపాదించుచు తన్మతసూత్రాను గుణముగా నిర్మింపబడినవి జైనపురాణములు. ఇట్టివి సంస్కృతప్రాకృత భాషలలో వెలయించుటయే కాక సామాన్యజనుల కందుబాటులోనికి వచ్చునట్లు జైనకవులు దేశీయభాషలలో అనువాదము కావించిరి. అవి మతప్రవక్తలను భగవన్మూర్తులుగా భావించి భజించుటకును, తన్మతానుయాయు లగు మహాత్ముల మహిమలను గ్రహించుటకును, స్వీయమత సమర్థనమునకును పరమతఖండన మునకును అవసర మైన పరిజ్ఞానము నందించుటకును, ఏర్పడిన కథాకావ్య ములుగా రూపొందినవి. ఇందు చరిత్ర కందని సనాతనులచరిత్ర లుండకపో వచ్చును. సమకాలికులే పురాణ పురుషులుగా కీర్తింపబడవచ్చును, పురాణగౌర వము నభిలషించెడి నవీనమతముల ఆకాంక్షలు నామశ్రవణ మాత్రముననే

-పురాణత్వము స్ఫురింపజేయు నిట్టి నవీనసాహిత్య ప్రక్రియలకు దోహదక్రియ లొనర్చినవి.

దక్షిణదేశభాషా సాహిత్యములలో ఇట్టిపురాణములు మతవాఙ్మయముల కెత్తిన కీర్తిపతాక లై విరాజిల్లుచున్నవి. కన్నడమున ప్రసిద్ధజైనకవులు తీర్థంకరులచరిత్రలను పురాణములుగా వెలయించిరి. 'ఆదికవి' యని ప్రసిద్ధి గాంచిన పంపకవి (క్రీ. శ. 941) జైనప్రథమతీర్థంకరు డైన పురుదేవుని చరిత్రమును 'ఆదిపురాణ' మనుపేర చంపువుగా రచించెను. ఆది జినసేనుని సంస్కృతకృతికి అనుకృతి. అట్లే 'ఉభయకవిచక్రవర్తి' యైన పొన్నకవి పదునారవ జైనతీర్థంకరుని జీవితచరిత్రమును చంపువుగా శాంతిపురాణ మనుపేర రచించెను. 'కవిచక్రవర్తి' రన్నడు ద్వితీయతీర్థంకరుని చరిత్రను 'అజితపురాణ' మను చంపువుగా నిర్మించెను. ఇవికాక నాగచంద్రకవి మల్లినాథపురాణము, నయసేనుని ధర్మనాథపురాణము, జన్నకవి 'అనంతనాథపురాణము' మొదలగునవి ప్రసిద్ధ కన్నడజైనపురాణములు ద్రావిడవాఙ్మయమునందు అఱువత్తుమూవురునయనారులను శివభక్తుల చరిత్రలను సంతరించి 'శేక్కిళ్లార్' అనుకవి రచించిన 'పెరియపురాణము' కడుప్రసిద్ధి కెక్కియున్నది. ఇట్లు మతాచార్యులయొక్కయు, భక్తులయొక్కయు కథలను గుదిగ్రుచ్చి కూర్చి ఒకకథాహారముగా సంతరించి పురాణ మనుపేర ప్రవర్తిల్లచేయుట కర్ణాటద్రవిడకావ్య వస్తునిర్మాణపద్ధతులలో ఒకటిగా క్రీ.శ. 10వ శతాబ్దమునుండియే గుర్తింపబడియున్నదని తెలియుచున్నది.

సంస్కృత పురాణ పంచలక్షణములకు ప్రతిగా జైనులు తమపురాణములందలి తీర్థంకరుల చరిత్రలలో ఉత్సవ పంచకమును - లేక - పంచజిన మహాకల్యాణములను వర్ణించిరి. రన్నకవి జైనపురాణములందు ఈ ఉత్సవ - లేక - కల్యాణపంచకము సవిస్తరముగ వర్ణింపబడవలె నని పేర్కొనియుండెను. అవి [20] సురలోకావతరోత్సవము - లేక - గర్భావతరణ కల్యాణము. 2. జన్మాభి

20. 'సురలోకావతరోత్సవం, పరికృతం జన్మాభిషేకోత్సవం, పరినిష్క్రాంతి మహోత్సవం, ప్రవిమలం కైవల్యబోధోత్సవం, పరినిర్వాణమహోత్సవం, జినమహాకల్యాణ మైదుం సవిస్తరదిందుర్వుపు'— రన్నకవి. (చూడు: ఆది పురాణ సంగ్రహ పీఠిక పుట 56. సంపాదకుడు: ఎల్. గుండప్ప. ఎం.ఏ.)

షేకోత్సవము - లేక - జన్మాభిషేక కల్యాణము. 3. పరినిష్క్రాంతి మహోత్సవము - లేక - పరినిష్క్రమణ కల్యాణము. 4. కైవల్యబోధోత్సవము - లేక - కేవలజ్ఞానకల్యాణము. 5. పరినిర్వాణ మహోత్సవము - లేక - పరినిర్వాణ కల్యాణము. జైనసాహిత్యమున ఈఉత్సవ కల్యాణ పదములు పర్యాయపదములుగా వాడబడినవి. తీర్థంకరుని దివ్య జన్మకు హేతుభూత మైన కథాభాగము ప్రథమకల్యాణము. తీర్థంకర జన్మసమయమున ఇంద్రాది దేవతలు భువి కవతరించి క్షీరాభిషేకాదులతో ఆ మహామహుని పూజించి, అతనిమహిమాన్విత మైన జీవితగాథకు నాంది నాలపించు ఘట్టము ద్వితీయకల్యాణము. తీర్థంకరుడు సంసారము రోసి జ్ఞానసిద్ధికై తపోవనమున కరుదెంచుఘట్టము తృతీయ కల్యాణము. జ్ఞానసిద్ధియు, తత్త్వబోధ నిర్వాణములును చతుర్థ పంచమకల్యాణములు. ఈవిభాగములను గమనించినచో జినబుద్ధదేవుల జీవితచరిత్రల కవి సమముగా వర్తించునని సులభముగా ఊహించవచ్చును. అవి ఒకమహాజ్ఞాని జీవితమునందు ప్రథమోషస్సునుండి చరమోషస్సువరకు సహజముగా ఏర్పడు ఐదుసోపానములు. కావున తీర్థంకర చరిత్రల కవి అవశ్యలక్షణములై ప్రవర్తిల్లినవి. జైనపురాణములును పంచకల్యాణలక్షణలక్షితము లై పురాణగౌరవము నందుకొనినవి.

జైన పురాణములందు మతసంబంధము లైన శాస్త్రాచారాద్యంశములను వదలినచో ప్రధానముగా ఎన్నదగిన లక్షణములు మరిరెండు కలవు. అవి: 1. భవావళి. 2. త్రిషష్టిశలాకామహాపురుష చరిత్రమువర్ణనము. భవావళియనగా తీర్థంకరుల పూర్వజన్మలవరుస అనిఅర్థము. జైనసిద్ధాంతమున కర్మవాసనాబద్ధుడైన జీవుడు జ్ఞానోన్ముఖుడై పయనించుచు నీచజన్మలనుండి క్రమముగా ఉత్తమజన్మలను పొందుచు చివరకు కేవలజ్ఞానసిద్ధిని బడసి ముక్తు డగుటకు తీర్థంకరజన్మ మెత్తు నని విశ్వసింపబడును. తదనుగుణముగా జైనపురాణము లందు ప్రథమకల్యాణ కథావసరమున ఆతీర్థంకరజీవసంస్కార పరిణామ నిరూపకము లైన అనేకపూర్వజన్మ గాథలు చెప్పబడును. అవియన్నియు తీర్థంకర జీవితకథా రూపకమునకు ప్రస్తావనాంగతుల్యము లై రక్తికట్టుచుండును. ఆకథాభాగము భవావళి, మహాపురాణ సంప్రదాయమున సర్గప్రతిసర్గాదులలో బ్రహ్మాండజీవనోత్పత్తి క్రమవికాసము పురాణారంభమున వర్ణింపబడుచుండ

జైనపురాణములు తీర్థంకరజీవ పరిపక్వదశాభివర్ణనమును ఆరంభమున నిబంధించుకొనినవి.

జినధర్మమును నమ్మి సద్గతి పడసిన మహాపురుషులు అరువదిముగ్గురు కల రని జైనమత సంప్రదాయము. వారిని త్రిషష్టిశలాకా మహాపురుషు లందురు వారు ఇరువదినలుగురు తీర్థంకరులకంటె భిన్నులు. వారిగణన మిట్లు కలదు. 12 మంది చక్రవర్తులు, 24 మంది కామదేవులు, 9 మంది బలదేవులు, 9 మంది వాసుదేవులు, 9 మంది ప్రతివాసుదేవులు. వారిలో అధములు ప్రతివాసుదేవులు. వారు భవబంధమగ్నులు. పైవారిలో ఉత్తములు చక్రవర్తులు. వారు సత్త్వ గుణసంపన్నులు: వారందరికంటె సర్వోత్తములు తీర్థంకరులు. అట్టి తీర్థంకరుల చరిత్రలలో పైత్రిషష్టిశలాకా మహాపురుషులచరిత్రలు యథావకాశముగా చెప్ప బడుట జైనపురాణ సంప్రదాయము. పరిపూర్ణ జీవితులైన మతప్రవక్తల చరిత్రలలో తరతమ భేదాధికారులైన మహాపురుషుల చరిత్రలు వర్ణింపబడినచో సామాన్యప్రజలకు నిర్వాణ మార్గసోపాన క్రమమును ఏర్పరచుకొనుటకు వీలు కలుగు ననుట నిర్వివాదాంశము.

పైపర్యాలోచనమువలన జైనపురాణ నిర్మాణవిధానము, తల్లక్షణవిధము స్థూలముగా తెలిసికొన వీలగుచున్నది. అది మహాపురాణ సంప్రదాయముకంటె భిన్న మైనదనియు స్పష్ట మైనది. పంచలక్షణ సూత్రము మహాపురాణ సంప్ర దాయము. పంచకల్యాణసూత్రము జైనపురాణ సంప్రదాయము, జైనపురాణ ములలో పౌరాణికకల్పన యెంత యుండునో దేశీయతాముద్ర అంత యుండును. కావున మహాపురాణ సంప్రదాయము మార్గపురాణ సంప్రదాయ మనియు, తద్భిన్న మైన జైనపురాణ సంప్రదాయము దేశిపురాణ సంప్రదాయ మనియు ఇందు భావింపబడుచున్నది, ఆంధ్రవాఙ్మయ చరిత్రమున మార్గదేశి కవిత్వముల విభాగ మెట్లు వర్తించునో – ఆంధ్రపురాణవాఙ్మయ పర్యాలోచనమున మార్గదేశి పురాణరచనా సంప్రదాయముల సమన్వయ మట్లు సార్థకము కాగలదు.

## 3

తెలుగున నన్నయ మహాభారతానువాదము నారంభించి మహాకావ్యరచన ముతోపాటు మార్గకవిత్వపద్ధతికి శ్రీకారము చుట్టినను తెలుగులో వెలసిన

మొదటిపురాణము అనువాదము కాదు; స్వతంత్రపురాణము. మార్గసంప్రదాయమునకుచెందిన మహాపురాణము కాదు; జైనపురాణనిర్మాణ పద్ధతికి చెందిన దేశిపురాణము. వీరశైవమతమున కొక తెలుగుకవి ప్రామాణికముగా నిర్మించి యిచ్చిన ప్రథమపురాణము. ఈగౌరవము పాల్కురికి సోమనాథకవి రచించిన బసవపురాణమునకు దక్కుచున్నది. అనువాదయుగమని ప్రసిద్ధిగాంచిన సాహిత్య చరిత్రాధ్యాయములో స్వతంత్రపురాణరచనము ఆంధ్రులకే ఒకగర్వకారణము.

కన్నడదేశమునుండి బసవేశ్వరప్రోక్తమైన వీరశైవమతము పండ్రెండవ శతాబ్దిలో ప్రబలముగా వ్యాపించినది. పండితత్రయమును ఉత్తేజపరచి శతకములను, స్తుతులను, గద్యలను, వర్ణనములను రచింపచేసినది. మతప్రచారమున కెన్నిసాహిత్యప్రక్రియ లున్నను పురాణముతో సరిరావు. వీరశైవజన్మక్షేత్రమైన కన్నడదేశముననే ఆమతమున కట్టి గ్రంథ మేర్పడలేదు. పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధమున పాల్కురికి సోమనాధు డామతమునకు పురాణము నిర్మించెడి యత్నము చేసినాడు. అతనిరచనపై కన్నడదేశమున వెలసిన వీరశైవ వచనగీతములే కాక, కన్నడసాహిత్యమున వ్యాప్తిగాంచిన జైనపురాణనిర్మాణ ప్రక్రియయు బలమైన ప్రభావము వేసినవి. అందువలననే బసవ పురాణ నిర్మాణముపై జైనపురాణ ప్రభావము కానవచ్చును.

వీరశైవులకు ప్రత్యక్షప్రత్యర్థులు జైనులు. జనాదరణపాత్రము లైన జైనపురాణ నిర్మాణశిల్పముల నెరిగి సోమనాథుడు ప్రథమవీరశైవపురాణము నిర్మించి ప్రజాహృదయములను చూరగొన యత్నించినా డనుటలో ఆశ్చర్యము లేదు. వీరశైవమతాచార్యుడగు బసవేశ్వరుని అవతారపురుషునిగా నిరూపించుటయే కాక, తత్పూర్వజన్మవిశేషములను అభివర్ణించి, ఆదిమూలమైన అతని స్వరూపము నెరింగించి ప్రస్తుతావతారహేతువును నిర్దేశించిన కథాభాగము బసవ పురాణేతివృత్తమున ప్రస్తావనగా అలరారుచున్నది. బసవేశ్వరుడు తొలుత సృష్ట్యాదియం దున్న ధర్మస్వరూపు డగు ఆదివృషభేంద్రుడు. ఆపై నతడు శిలాదుని తపఃఫలముగా నందీశ్వరుడై జన్మమెత్తి ద్వితీయశంభు డని కీర్తి గాంచెను. నందీశ్వరుడే శైవమతోద్ధరణార్థమై బసవేశ్వరాఖ్యతో మరల భువియం దవతరించెను. దీనికి సూత్రధారుడు పరమేశ్వరుడు, ఇంతకంటె పురాణమునకుఉదాత్తారంభ మేమి కావలెను? సర్గాదికథన మార్షపురాణారంభమై యుండ

గా ఆచార్యపూర్వావతారకథాకథన మీపురాణప్రస్తావనమై పరిఢవిల్లినది. దానిపై జైనపురాణమునందలి 'భవావళి' ప్రభావము ప్రస్ఫుటముగా కానవచ్చుచున్నది.

జైన పురాణప్రధాన వస్తులక్షణము లైన పంచకల్యాణముల ప్రభావము బసవపురాణము నందలి బసవేశ్వర చరిత్ర నిర్మాణముపై కలదు. మాదాంబా గర్భ సంజాతునిగా బసవేశ్వరుని జన్మ వృత్తాంతము వర్ణించునెడ గర్భావతరణ కల్యాణ కథా సాదృశ్యము స్పష్టమగుచున్నది. జైన పురాణములలో జన్మాభిషేక కల్యాణ ఘట్టమున ఇంద్రాదులు శిశువునకు క్షీరాభిషేకాదులు చేయుట వర్ణింపబడగా బసవపురాణమున సంగమేశ్వరుడు ప్రత్యక్షమై జంగమపాద తీర్థములతో బాలునిమేను కడిగి, విబూదిపూతలు పూసి బసవ జన్మాభిషేకోత్సవము నిర్వహించినట్లు అభివర్ణింపబడినది. జైనులకు క్షీరాభిషేక మెంత పవిత్రమో వీరశైవులకు జంగమపాదతీర్థసేచన మంత పవిత్రము. ఇక జైన పురాణము లందలి పరినిష్క్రాంతికి బదులు బసవేశ్వరుడు ఉపనయ సంస్కారమును మాని వీరమాహేశ్వరవ్రత దీక్ష వహించుట చెప్పబడినది. కైవల్యబోధోత్సవమునకు మారుగా సంగమేశ్వరుడు బసవేశ్వరున కొనర్చిన ప్రబోధము నిర్వహింపబడినది. పరినిర్వాణ మహోత్సవస్థానమున బసవని జ్ఞానబోధలు, లింగైక్యమును వర్ణింపబడినవి. జైనులకు త్రిషష్టి శలాకా మహాపురుషులవలె శైవులకు అరువది మూవురు నయనార్లు కలరు. ఇచ్చట కుదిరిన సంఖ్యాసామ్యము గమనింప దగిన యంశము. ఈ సామ్యమును గమనించియే కాబోలు సోమనాథుడు జైన పురాణ సంప్రదాయమునకు ప్రతిగా అరువత్తుమూవురు నయనార్ల కథలను (వారందరు వీరశైవులు కాకపోయినను) గ్రహించి బసవపురాణమున నిబంధించెను. దీనితో సోమనాథుడు దేశీయమైన పురాణ సంప్రదాయముతోపాటు శివభక్తాభీష్టమును గూడ పాటించె నని తలంప వీలగుచున్నది.

కర్ణాటాంధ్రములయందు జైన పురాణములు వైదిక పురాణముల కెదురు నిలిచి ప్రజాదరణ పొందుటకు యత్నించినవి. కొంతకాల మాపురాణములు ప్రజల హృదయసీమలపై రాజ్యము చేసినవి. పోటీపడి జనాదరణమా నొందుటకై వీరశైవులు ప్రథమ పురాణ నిర్మాణయత్నము కావించిరి. సోమనాథునిపై ఆభార ముంచిరి. అతడు జైన పురాణనిర్మాణ శిల్ప రహస్యములను ప్రచ్ఛన్నముగ కొల్లగొట్టి ప్రథమ వీరశైవ పురాణమును నిర్మించెను. ఇట్లనుటచే జైన పురాణ

లక్షణము లన్నింటిని సోమనాథుడు యథాతథముగా అనుకరించె నని తాత్పర్యము కాదు. అతడు తన గ్రంథప్రణాళికకు ఒదిగినంతవరకు వానిని నిపుణముగా గ్రహించి స్వీయప్రతిభతో స్వతంత్ర పురాణ రచనావిధానము నేర్పరచుకొనెను.

బసవని చరిత్రమే బసవపురాణప్రధానేతివృత్తము. సోమనాథుడు తన పురాణకథా వస్తువును సేకరించుకొనిన విధము నిట్లు చెప్పుకొనెను:—

"ఆతత బసవపురాతన భక్త
గీతార్థసమితియే మాతృక గాఁగఁ
బూరితం బై యొప్పు పూసలలోన
దారంబుక్రియఁ బురాతనభక్తవితతి
చరితలలోపల సంధిల్ల బసవ
చరిత మే వర్ణింతు సత్కృతి యనఁగ"

"ప్రస్తుతింపంగ సద్భక్తివిస్ఫురణఁ
బ్రస్తుతికెక్కిన బసవనిచరితఁ
జెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ
దప్పకుండగను యథాశక్తిఁ జేసి."

ఈ వాక్యములనుబట్టి బసవపురాణ మేపురాణమునకును అనువాదము కాదనియు, శివభక్తులయందును, పురాతనభక్తగీతార్థములయందును వ్యాపించి యున్న బసవకథార్థములను ప్రోగుచేసి, స్వీయప్రతిభతో వానిని రసవత్తరము లొనరించి, సంవిధానము చెడకుండ వానిని గుదికూర్చి సోమనాథుడు పురాణ నిర్మాణ మొనర్చె ననియు స్పష్ట మగుచున్నది. సోమనాథు డీపురాణమును భక్తజనకథామంజరిగా అలంకరించినను అందైక్యమను సూత్రమును బసవని చరిత్రలో సాధించుటవలన అతని కావ్యవస్తువునకు ప్రబంధసౌందర్య మబ్బినది. సోమనాథుడే పండితారాధ్య చరిత్రమున భక్తులు తన పురాణనూతనత్వమును, అందితిహాసఘటనమువలన కథాకథనమున కేర్పడిన ప్రాబంధ్యమును కీర్తించి నట్లు ప్రత్యేకముగ చెప్పుకొనినాడు.

"ఖ్యాతిగా సద్భక్త గణలాలనముగ
నూతనంబుగ జగన్నుతముగా మున్ను
బసవపురాణ మొప్పగ రచించితివి

బసవపురాణ ప్రబంధంబునందు
ప్రథిత పురాతనభక్తగుణాను
కథనంబు లితిహాసఘటనఁ గూర్చితివి".

బసవపురాణమున శివభక్తులకథ లనేకములు కలవు. ఆభక్తులలో బసవేశ్వరునకు సమకాలీనులైనవా రున్నారు. వారిలో అల్లమప్రభువు, ముగ్ధసంగయ్య, మడివాలు మాచయ్య, సిద్ధ రామయ్య, సకలేశ్వర మాదిరాజయ్య, కిన్నర బ్రహ్మయ్య, కన్నద బ్రహ్మయ్య, కలకేత బ్రహ్మయ్య, మోళిగ మారయ్య, ముసిడి చౌడయ్య, సురియ చౌడయ్య, తెలుగు జొమ్మయ్య, ఏకాంత రామయ్య, షోడ్డలదేవు బాచయ్య, సివనాగుమయ్య మొదలగువారు ముఖ్యులు. సమకాలీనభక్త చరిత్రములు బసవనితో ముడివడి యున్నను పురాతనభక్త చరిత్రములు తత్కథాసందర్భములందు దృష్టాంతరూపములుగా చెప్పబడినట్లు కూర్చుట సోమనాథుని కథాసంవిధాననైపుణ్యము.

పురాతనభక్తులలో ముగ్ధభక్తులు కొందరు కలరు. 'నిక్క మీశ్వరుఁగాని నిజ మెఱుంగమిని. ముక్కంటిభక్తులు ముగ్ధలు గారె?' అని బసవేశ్వరుడు ముగ్ధభక్తుల స్వభావమును పేర్కొనినాడు. వీ రన్యభక్తులవలె వీరమాహేశ్వర వ్రతపారీణు లై యున్నను విశేషించి అమాయకులు, నిరాడంబరులు, స్నిగ్ధప్రవృత్తులు, స్వచ్ఛమైన వాత్సల్యము, పారవశ్యముతో కూడిన భక్తిభావము, వెన్నవంటిహృదయము, శివుని గాంచినంతనే అప్పునివలె, మిత్రునివలె, పుత్త్రునివలె భావించి ముగ్ధభావముతో కీర్తించి, సేవించి, లాలించెడి స్నేహభావము వారికుగ్గుతో వచ్చినవిద్య. శివునికొరకై ప్రాణములనుసైతము పణమొడ్డుటకు సిద్ధ మగు త్యాగోత్సాహమూర్తు లైన భక్తివీరులు వారు. రుద్రపశుపతి, నక్కనైనారు, బెజ్జమహాదేవి, గొడగూచి, దీపదకళియారు, నాట్యనమిత్తండి, ఉడుమూరు కన్నప్ప, కళియంబ నయనారు, సకలేశ్వర మాదిరాజయ్య, ముగ్ధసంగయ్య మొదలగు ముగ్ధభక్తుల చరిత్రములు ఈ పురాణమున భక్తిరసోల్లాసముగా వర్ణింపబడియున్నవి,

వీరశైవము భక్తిప్రధాన మైన మతము. ఆభక్తి ఆవేశప్రధాన మై సాహసోపేతము లైన అద్భుతకార్యములచే ప్రపంచిత మగుచుండును. వీరశైవులందు స్వీయమతాభినివేశ మెంత యుండునో అన్యమతతిరస్కారమంత

కానవచ్చుచుండును. వీరమాహేశ్వరవ్రతుడైన జంగము దేకులమునకుగాని, ఏవృత్తికి గాని చెందియున్నను శివునివలె పూజనీయుడే; సహపంక్తిభోజనాదుల కర్హుడే. ఇట్టి భక్తిసంప్రదాయము వీరశైవమతప్రత్యేకతను చాటుచున్నది. సోమనాథుడు వీరశైవమతరహస్యములను స్పష్టపరచునట్టి విధముగా భక్తకథా సంవిధానమును బసవపురాణమున నిర్వహించెను. బసవపురాణపాత్రలందరిలో సాత్త్వికుడుగా, మహామహిమాన్వితుడుగా బసవేశ్వరుడు కానవచ్చుచున్నాడు. బసవేశ్వరుడు జంగమారాధన మొనర్చు వీరమాహేశ్వరాచార్యు డయ్యును అవతారపురుషు డనియు, శివునకును బసవనికిని భేదము లేదనియు నిరూపించుట ఈపురాణతాత్పర్యము. శివభక్తికిని, బసవభక్తికిని భేదము లేదు. పరమశివుడే 'తప్ప దే నతఁ డని తర్కించిచూడ' నని పలికియున్నాడు. శివు డవ్యక్తలింగము. సాకారలింగరూపు డగు బసవేశ్వరుఁడు వీరశైవులకు పరమప్రామాణికుడు. వారిపురాణమున కతడే నాయకుడు. అతనియందు భక్త్యావేశము పరాకాష్ఠ నొందినట్లు సోమనాథుడు చిత్రించెను.

"వడిఁ బారు జలమున కొండలెల్ల కాళ్లు
వడిఁ గాలు చిచ్చున కొండలెల్ల నోళ్లు
వడి వీచు గాడ్పున కొండలెల్ల దలలు
వడి చేయు బసవన కొండలెల్ల భక్తి"

ఇట్టి మతాచార్యుని వీరశైవభక్తిచరిత్రము వర్ణింపబడిన **బసవపురాణము** భక్తివీరమునకు పట్టుకొమ్మ. తద్రసపుష్టి సర్వాంగసుందరముగా నిర్వహింపబడునట్లు సోమనాథుడు పురాణమును రచించెను. ద్విపదలో వెలసిన పురాణములలో ఇది అద్వితీయ మైనది. బసవపురాణముతరువాత స్వతంత్రదేశిపురాణ రచన తెలుగులో సాగలేదు.

## 4

మహాపురాణసంప్రదాయమున తెలుగున వెలసిన పురాణవాఙ్మయమంతయు అనువాదసాహిత్యమే. ఆంధ్రసాహిత్యమున రసోచిత మైన కథానువాదప్రక్రియకు రూపకల్పన చేసి ప్రాణము పోసినవారు. కవిత్రయమువారువారి మహాభారతానువాదవిధానమే ప్రాచీనాంధ్రపురాణకర్తలకు మార్గదర్శక మైనది.

ఆంధ్రసాహిత్యమున నన్నయ మహాభారతానువాదము చేపట్టునాటికే సంస్కృతసాహిత్యమున పురాణేతిహాసకావ్యప్రక్రియలు ప్రత్యేకప్రతిపత్తి గడించి శాఖోపశాఖలతో విస్తరించినవి. పురాణములు ధర్మనీతిప్రధానములు. కావ్యములు రసప్రధానములు. ఇతిహాసములు శాస్త్రవిషయప్రధానములయ్యు కావ్యచ్ఛాయలను సంతరించుకొనిన మిశ్రమూర్తులు. తెలుగున కవిత్రయము వారు ఇతిహాసానువాదమును చేపట్టినను అందలి కావ్యాంశను విస్తరించిపోషించిరి. అందువలననే ఆంధ్రమహాభారతమున మూలమునందలి శాస్త్రవిషయములు సంగ్రహింపబడినవి. రసపోషకములైన కావ్యార్థములు విశేషించి పోషింపబడినవి. తిక్కన సోమయాజి ఆంధ్రభారతమును ప్రబంధమండలి అనుటలోని అంతరార్థ మదియే. కవిత్రయమువారు తెలుగుకవులకు రసదృష్టిని ప్రసాదించిరి. వారి తరువాత సాహిత్యరంగమున ఏప్రక్రియ చేపట్టిన కవియైనను అందు కావ్యత్వమును స్వీయోపజ్ఞతో సంతరించుటకు ప్రయత్నించెను. ప్రాచీనకాలమున కావ్యస్పృహ లేని తెలుగుకవి తెలుగుగడ్డమీద గౌరవింపబడలేదనియే చెప్పవచ్చును.

కవిత్రయములో కావ్యస్పృహ ముత్తెరంగులుగా మోసుకెత్తెను. నన్నయలో అది కథాశిల్పమును, తిక్కనలో రసశిల్పమును, ఎఱ్ఱనలో ఉక్తిశిల్పమును ఆశ్రయించి పెంపొందెను. అది ఆంధ్రపురాణరచనపై బలమైనప్రభావము వేసెను. మారన తిక్కనకావ్యకళాశిల్పములను మార్కండేయమున పొందుపరచెను. ఎఱ్ఱయ ఉక్తివైచిత్రితోపాటు వర్ణనలకు ప్రాధాన్యము కల్పించెను పురాణసమగ్రానువాదముకంటె పురాణకథలను జోడించి వస్తుసమగ్రతను సంతరించుకొని వర్ణనలచే పెంపు గావించి స్వతంత్రప్రతిభతో పురాణమున ప్రబంధచ్ఛాయలను వెలార్చు ఒక నూత్నమార్గమును నృసింహపురాణమున ప్రకటించెను. శ్రీనాథుడాసూత్రము నందుకొని పురాణఖండానువాదమున గుప్పించెను. ఎఱ్ఱయ చూపించిన మార్గమును శ్రీనాథుడు ఘంటాపథముగా మార్చెను. పోతన ఎఱ్ఱయ శ్రీనాథుల పద్ధతులను అదనెరిగి భాగవతరచనలో పొందుపరచుకొనుటయే కాక భక్తిరసమును పురాణప్రక్రియలో ప్రాణప్రతిష్ఠ గావించెను. ఇట్లు ప్రాచీనాంధ్ర కవులు రచించిన పురాణములకు కావ్యపద్ధతి చేవకల్పించినది. అందువలననే ఆంధ్రపురాణేతిహాసములలోని ఉపాఖ్యానములు సైతము స్వతంత్రకావ్యములుగనో, లఘుకావ్యములుగనో మనకు తోచుచుండును.

ఆంధ్రసాహిత్యచరిత్రలో పురాణరచనాపరిణామమును గమనించినచో కావ్యపురాణప్రక్రియలకు స్పర్థ కానవచ్చుచున్నది. కవిత్రయయుగమున ఈ రెండుప్రక్రియలు అక్కసెల్లెండ్రవలె పరస్పరపోషకముగా పెరిగినవి. శ్రీనాథయుగమున కావ్యపురాణప్రక్రియలు పోటీపడి నిలిచినవి. ప్రబంధయుగమున కావ్యప్రక్రియకు గౌరవము హెచ్చి పురాణములకు గౌణమైన ప్రాధాన్యము వచ్చినది. దక్షిణాంధ్రయుగమునకూడ అట్టిస్థితియే కొనసాగినది. ఆకాలమున పురాణములు వచనకృతులుగా వెలువడి కొంత ప్రక్రియావైవిధ్యమును సంపాదింపయత్నించినవి. కాని క్షీణయుగమునుండి పురాణములు కావ్యస్పృహకు దూరమై మూలపాదసేవనమునకు గడంగినవి, ఆధునికయుగములో నూత్న కావ్యప్రయోగముల కున్నగౌరవము పురాణప్రక్రియకు లేదు. అయినను, ఆశాఖ నేటికిని అంతరించి పోలేదు. కాని, కవిత్రయయుగమునాటి కాంతి కాని, కావ్యయుగమునాటి విక్రాంతి కాని నేటిపురాణరచనకు లేదు. ఆంధ్రపురాణసాహిత్యమునకు సంబంధించినంతవరకు క్రీ.శ.13వ శతాబ్దినుండి 15వ శతాబ్దివరకు గల కాలము స్వర్ణయుగము.

తెలుగులో పురాణైకకర్త లున్నారు. పురాణకావ్యోభయకర్త లున్నారు. మొదటితెగవారికి వారికృతుల కున్నగౌరవ మెంతయో అంతకలదు, రెండవతెగవారి కావ్యముల కున్నగౌరవము వారిపురాణములకు కానరాదు. అనగా తెలుగు సాహిత్యమున కావ్యస్పృహ కున్న గౌరవము పురాణానువాదమునకు లేదు. అందువలననే పురాణరచనమునందు కావ్యచ్ఛాయలను పోషించి ఆప్రక్రియకు గౌరవప్రపత్తులు కల్పించిన పురాణకర్తలు నేటికిని పూజనీయు లగుచున్నారు. మిగిలినవారు చరిత్రపుటల కెక్కి చరితార్థు లగుచున్నారు.

ఆంధ్రసాహిత్యమున పురాణనిర్మాణవిధానమును పరిశీలించినచో ప్రధానముగా నాలుగువిధములైన శైలులు కానవచ్చుచున్నవి. 1. రసవత్పురాణకథాకథనశైలి. 2. భక్తిరసపోషణశైలి. 3. వర్ణన ప్రధానమైన ఖండానువాదశైలి. 4. మూలవిధేయమైన అనువాదశైలి. ధర్మార్థప్రధానములైన పురాణకథలను రసశిల్పసమన్వితములుగా నొనరించి పురాణము నొక రమణీయ రసవత్కథామంజరివలె తీర్చిదిద్దుపద్ధతి మొదటిది. ఇట్టిపద్ధతికి నన్నయభట్టే కొంతవరకు మార్గము వేసినాడు. దానిని పురాణమున కన్వయించుకొని మారన కవి మార్కండేయపురాణమున వెలయించినాడు. ఈ మార్గమున నడచినవారు

వెన్నెలకంటి సూరన, నందిమల్లయ ఘంటసింగయలు, దేవీభాగవతకర్తలు మొదలైనవారు. ఆంధ్రభాగవతపురాణమును బమ్మెరపోతన భక్తకల్ప ద్రుమముగా నిర్మించి భక్తిరసపోషణపద్ధతికి పరిపూర్ణసరూపమును ఆవిష్క రించి కీర్తికెక్కినాడు. సహజకవితాధురంధరుడును, మహాభక్తుడును అయిన ఆ మనీషి అనన్యసామాన్య మైన స్వీయకవితాశైలితో భాగవతమున కొక మహోన్నతస్థితిని కల్పించుటయేకాక, ఆంధ్రుల కత్యంతప్రీతిపాత్రుడైనాడు. భక్తికవితకు పోతనశైలియే పరాకాష్ఠ. భక్తిపురాణకవిత కతనిగ్రంథము ఏకైకనిదర్శనము. భాగవతము నెందరో అనువదించిరి. కాని, పోతనమార్గము వారి కసాధ్యమైనది :

స్థలదేవతీర్థమహిమాభివర్ణనదృష్టితో ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణము రచించెను. అందాకవి ప్రదర్శించిన వర్ణనావైదగ్ధ్యమునకు ప్రబంధపరమేశ్వర బిరుదము సార్థకమైన దని సాహిత్యవిమర్శకులు తలంచుచున్నారు. వర్ణనాబహుళ మైన ప్రౌఢకవితాశైలితో రచించు ఇట్టిపురాణమార్గమునకు ఎఱ్ఱాప్రెగ్గడ గురుపీఠము. భీమఖండ, కాశీఖండాదులను రచించిన శ్రీనాథు డీమార్గమున నడిచి కాంతప్రత్యేకతను సాధించుకొనినాడు. ఎఱ్ఱయకృతిలో వర్ణనావైశిష్ట్యమున్నను వస్త్వైక్యము చెడలేదు. శ్రీనాథునికృతులలో వర్ణన కున్న ప్రాధాన్యము వస్త్వైక్య మునకు కానరాదు. పురాణమున ప్రబంధమును మూర్తికట్టించినవా రొకరు కాగా ప్రబంధశైలిలో పురాణమును నిర్మించినవారు మరొకరు. వీ రిరువురు చూపిన బాటలలో మేలిమిని గ్రహించి తమరచనలను సాగించినవారు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, మడికి సింగన మొదలైనవారు.

మూలవిధేయ మైన పురాణానువాదము క్షీణయుగమున ప్రారంభమై ఆధునికయుగమున విస్తరిల్లినది. మూలతాత్పర్యము మొక్కవోకుండ పఠితల కందించుటయే ఈశైలికి పరమధ్యేయము. యోగ్యతనుపట్టి చూచినచో పైశైలులలో ఇది అధమము. కావ్యకళావైభవము లేని పురాణానువాదము ఆంధ్రులకు రుచింపదు. కవిత్రయమువారే అట్టి అభిరుచిని మనజాతికి నేర్పినారు. ఆరుచిని వీడలేని రసికజాతి మనది ।

ఆంధ్ర సాహిత్య చరిత్రలో పదునారవశతాబ్దికి పూర్వము వెలసిన పురాణ వాఙ్మయము సమకాలీన సాంఘిక మత సాహిత్య ప్రయోజనములను సాధించుటతో పాటు శాశ్వత సాహిత్య ప్రమాణములను కూడ సంతరించుకొనినది. ఆ

తరువాత వెలసిన పురాణములు సాంఘిక మత ప్రయోజనముల నుద్దేశించి వెలు వడినట్లు కానరాదు. ఈ భేదము గమనింప దగిన అంశము. సమాజము నుద్దేశించి వెలువడెడి సాహిత్యమునకు సాంఘిక ప్రయోజన ముండుట అత్యావసరము. మహాభారత రచనము ద్వారా తొలుత కవిత్రయము వారే ఆ సత్యమును నిరూపించియుండిరి.

ఆంధ్ర పురాణ సాహిత్యమున కవిత్రయము వంటివారు పాల్కురికి సోమ నాథుడు, మారన, బమ్మెర పోతన. సమకాలీన సమాజ ప్రయోజనముల నుప లక్షించి, విశిష్ట కవితా దృక్పథముతో పురాణ ప్రక్రియను చేపట్టినవారు ఈ ముప్వురు. సోమనాథుడు వీరశైవ మతప్రబోధమునకై భక్త్యావేశ ప్రధాన మైన దేశిపురాణమును గానయోగ్య మైన ద్విపదలో వినిర్మించెను. మారన సోమనాథుని దేశిపురాణమార్గ మునకు ప్రత్యర్థి. అతడు మహాపురాణ సంప్రదాయ ప్రవర్తకు డై మార్కండేయము ననువదించెను. తిక్కన శిష్యు డైన మారన భక్త్యావేశము కంటె జ్ఞాన ప్రధానమైన అద్వైత తత్త్వమును, ద్విపదకంటె చంపూరచనెమును పురాణ రచన కుపాదేయ మని ఉపదేశించెను. భేదభక్తి ప్రబలిన సమాజమునకు జ్ఞానబిక్ష పెట్టుటకే మారన మార్కండేయమును చేపట్టెను. సోమన భక్తిమార్గ ప్రవర్తకుడు; మారన జ్ఞానమార్గ ప్రబోధకుడు. ఈ రెండు మార్గములును సమ ప్రాధాన్యము వహించి బమ్మెర పోతనలో సంగమించినవి. పోతన కవితలో భక్తి కెంత ప్రాధాన్య మున్నదో ముక్తి నొసగు జ్ఞానశక్తి కంత ప్రాముఖ్య మున్నది. పోతన సమన్వయ దృక్పథము పురాణమున కొక సమగ్ర వ్యక్తిత్వ మును, సార్వకాలిక ప్రయోజనమును సంతరించి పెట్టినది. తెలుగున పురాణ మేది? అన్నచో- పోతన భాగవతమే— అను ప్రసిద్ధికి దారితీసినది. భాగవత రచనానంతరము దాని ప్రతిపత్తి ని గడించిన మరియొక పురాణము లే దన్నచో విప్రతిపత్తి ఉండబోదు. ఈ కవిత్రయములో ప్రబంధ పరమేశ్వరస్థానీయు డైన పోతన 'పురాణ పరమేశ్వరుడు'.

## 5

మారన మార్కండేయపురాణము తెలుగున అనువదింపబడిన ప్రథమ మహాపురాణము. మారన తిక్కనసోమయాజి శిష్యుడు. మార్కండేయపురాణము

తిక్కనగారి వైదికమతధర్మాద్వైత ప్రచారమహాప్రణాళికలో కాలాంతరమున రూపుగొన్న సాహిత్యప్రక్రియాసాధనము. హరిహరాభేదభక్తియుక్తు డైన గన్న సేనాని కది అంకితము. గన్నసేనాని కాకతిరెండవ ప్రతాపరుద్ర దేవుని కటకపాలకుడు.

తిక్కనకాలమున శైవవైష్ణవములకు సంఘర్షణ మేర్పడెను. తిక్కన ఆమతములలోని వైదికమతాచారవిలుప్తిని, భేదదృష్టిని, మూఢభక్తిని గర్హించెను. వేదప్రామాణ్యభావమునకు ప్రాధాన్య మిచ్చెను. వైదికమార్గనిష్ఠ మగు వర్తనము వలన హరిహరాభేదరూపమగుభక్తి కుదురు నని ప్రబోధించెను. సాకారమూర్తుల వెనుక నిర్గుణ మై అద్వితీయ మై భాసించు పరతత్త్వము నెఱుంగుజ్ఞానమే భేదములేని భక్తి అని చాటిచెప్పెను. హరిహరభేదదృష్టి జ్ఞానమువలన నశించును. జ్ఞానవిరహిత మైన మూఢభక్తి భేదరూప మైన కాలుష్యమును హృదయమున పెంచును. తత్కాలుష్యపరిక్షాళనమువలన చిత్తమునందు నిర్మలవృత్తి ఏర్పడును.దానివలన భక్తుడు భగవత్పాదనిరంతరస్మరణతత్పరభావము పొందగలడు. అది బ్రహ్మానందసంధాయకము కాగలదు. ఇట్టి జ్ఞానమార్గము నాశ్రయించి తిక్కన-భేదదృష్టిని వరించి పెనగులాడుచున్న శైవవైష్ణవముల కెదురు నిలిచెను. కాని వారిపై విజృంభింపలేదు. నయకోవిదుడై వారిభేదదృష్టికి విఘ్నగుడు పెట్టెను. హరిహరాత్మక మైన పరతత్త్వమును చూపి, వారికిజ్ఞానదృష్టిని ప్రసాదించెనుపంచమవేద మైన మహాభారతము ననువదించి వేదహృదయమును సుహృత్సమ్మితముగా లోకమునకు బోధించెను. అయినను భారతరచనాప్రయోజనము సంపూర్ణముగా సాధింపబడవలె నన్నచో సంస్కృతసారస్వతమునందలి స్మృతి శాస్త్రములు, పురాణములుకూడ తెలుగున రావలెను. తిక్కనమనీషి ఈయంశమును గుర్తించి తనకు సన్నిహితులై యున్న కవికుమారులచే ఆయుద్యమమును వ్యాపింపజేయ సంకల్పించియుండవచ్చును. విచిత్ర మేమన తిక్కనకు దశకుమారచరిత్రము నంకిత మిచ్చిన మూలఘటిక కేతన విజ్ఞానేశ్వరీయమను ధర్మశాస్త్రగ్రంథమును రచించెను. అది యాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యాగ్రంథ మగు మితాక్షరికి ఆంధ్రానువాదము. తిక్కనశిష్యు డైన మారన మార్కండేయ పురాణము ననువదించి మహాపురాణవాఙ్మయమునకు ఆంధ్రమున అంకురార్పణము కావించెను. పురాణవిజ్ఞానమును ఆంధ్రజాతికి అనుదించి చెప్ప మొదలిడిన మారన నన్నయతిక్కనలవలెనే వైదికమతోద్ధరణమునకు కృషిచేసిన మహనీయు డైనాడు.

మారన మహాపురాణములలో మార్కండేయమునే ఏల ఎన్నుకొనవలెను? అను ప్రశ్న ఉదయించును. మార్కండేయము ఆంధ్రుల కభిమాని గ్రంథమైన మహాభారతము యొక్క ప్రశస్తితో ఆరంభించి, అందలి శంకాపంచక నివారణముతో ఉపక్రమించి, శాంతి పర్వములోని మేధావ్యుపాఖ్యానమునకు విస్తృత రూపమైన జడోపాఖ్యానమును అనుసంధించుకొని ముందుకుసాగి మహాభారత ప్రశస్తికి పతాకప్రాయమైన దని యశస్సు గాంచినది. తిక్కనగారి భారతము చదివి, తన్మాహాత్మ్య ప్రతిపాదకమైన ఈ పురాణము నెత్తుకొనుటకు జాతి ఉత్సాహము ప్రకటించును. అందువలన మారన మార్కండేయము నెత్తుకొనెను. అంతియ కాదు. మార్కండేయము బ్రహ్మర్షి నామముపై వెలసిన ఏకైక మహాపురాణము. అది జ్ఞానప్రధాన మైనది. దానియం దేప్రత్యేక దైవమున కధిక ప్రాధాన్య మీయబడలేదు. హరిహర చతురాననార్కాగ్ని దుర్గావనజా సరస్వత్యాదుల మాహాత్మ్యములు యథావకాశముగా అం దభివర్ణింప బడినవి. కావున ఈ పురాణము చేపట్టుటవలన తిక్కన హరిహరాద్వైతమునకు అపార బలము సేకూరినది. చాతుర్వర్ణ్య వ్యవస్థ, సదాచార విధానము, పుణ్యాపాప ఫల వివేకము, వేదవిహిత కర్మాచరణము. అష్టాంగ యోగాది విధులు, బ్రహ్మజ్ఞాన సాధనము, దార్మనికమూల మైన సృష్టి విధానము. ధర్మశాస్త్ర కర్త లైన మనువుల చరిత్రములు, ప్రజాహిత తత్పరులును ధర్మానురక్తులును అయిన సూర్యవంశ చక్రవర్తుల చరిత్రములు- ఇవియన్నియు వైదిక మత ప్రబోధాత్మకములే. వర్ణ వ్యవస్థలను, వైదికాచారములను, కర్మకాండను సంఘమున సముయింపచేయుచున్న వీరశైవాది మతములనుండి జనుల నుద్ధరింప తోడుపడెడి పురాణార్థములే ఇవి. మరియును కాకతీయుల కాలమున దుర్గాపూజయు ఓరుగల్లున ప్రాముఖ్యము వహించి యుండుటచే ఇందలి సప్తశతియు దేవ్యుపాసకుల నాకర్షించుట కుపకరించె నని భావింప వీలగుచున్నది. ఇట్లు ఈ మార్కండేయ పురాణము 14వ శతాబ్ది ప్రథమ పాదమునందలి కాకతీయ సామ్రాజ్యమునందలి మత సాంఘిక పరిస్థితులను వైదిక మతాభిముఖముగా ఉద్ధరింప సమర్థమై ఉండుటచేతను, తిక్కన అభిమతమున కది విరుద్ధ మగుటచేతను మారన మార్కండేయ పురాణమునే ప్రత్యేకించి అనువదింప చేపట్టె నని భావింప వలను పడుచున్నది.

మారన మార్కండేయ పురాణమును రచించుటకు మరికొన్ని కారణములు కలవు. 1. పాల్కురికి సోమనాథుడు నిర్మించిన వీరశైవ బసవపురాణము

అనాద్యము, అప్రమాణము అను వైదికమతస్థుల అభిమతమునకు అనుగుణముగా ప్రాచీనమును, ఆర్షమును అయిన పురాణమును అనువదించి మారన మహాపురాణ సంప్రదాయధ్వజము స్థాపింపదలచుట. 2. ద్విపదచ్ఛందమున కావ్యరచనము సాగించుచున్న శైవవైష్ణవ కవుల శుద్ధదేశి కవితాపద్ధతిని కాదని, నన్నయచే ఆరంభింపబడి, తిక్కనచే పుష్టిమంత మొనర్పబడిన చంపూకావ్య రచనమునకును మార్గ కవిత్వమునకును ప్రాచుర్యము కల్పింపబూనుట. 3. సమకాలీన సాహిత్య రంగమున నున్న కావ్యప్రక్రియల నన్నింటిని తనయందు ఇమిడ్చుకొనియున్న పురాణమును తెలుగున రూపొందింపవలె ననెడి విశిష్ట ప్రయత్నము. వీనిలో మొదటి రెండును క్రమముగా పురాణ స్వభావమునకును, ఛందస్సునకును సంబంధించినవి. మూడవది పురాణ విశిష్ట వ్యక్తిత్వమును చాటి చెప్పుచున్నది. కావున దీనిని కొంత వివరింపవలసి యున్నది.

మారనకాలమునాటికి తెలుగున మహాభారతేతిహాసము, రామాయణాది మహాకావ్యములు, కుమారసంభవాది వస్తుకావ్యములు, దశకుమార చరిత్రాది కథాకావ్యములు, సర్వేశ్వరసుమతీశతకాదులు, విజ్ఞానేశ్వరీయాది ధర్మశాస్త్రములు, పురుషార్థసారాదులవంటి రాజనీతిశాస్త్రములు, శైవపురాణములు, భక్త చరిత్రలు, స్తవములు ప్రసిద్ధ సాహిత్య ప్రక్రియలుగా ఉన్నవి. వీని లక్షణము లన్నియు ఈ మహాపురాణమునందు ఈ క్రిందివిధముగా ప్రతిబింబితము లయ్యె నని చెప్పవచ్చును— ఇతిహాసము పురాణాంతర్భాగము. సూర్యవంశరాజచరిత్ర మితిహాస మనబడును. హరిశ్చంద్రకువలయాశ్వ చరిత్రములను ప్రత్యేకముగా పరిగణించినచో అవి స్వయంసమృద్ధములైన కావ్యములుగా భాసింపగలవు. కుమారసంభవాది కథలవలె మనుసంభవగాథ లీపురాణమునందు విపులముగా వర్ణింపబడినవి. మార్కండేయము నంతటిని స్థూలముగా గమనించినచో ఒక రసవత్కథాహారమువలె శోభిల్లుచుండును కావున కథాకావ్యలక్షణము లిందు సహజముగా రాణించుచున్నవి. ఇక మకుట విశిష్టములైన స్తుతులు, స్తోత్రములు దండకములు, నీతిమత రాజకీయాదులకు సంబంధించిన సూక్తులు, దత్తాత్రేయుడు, శివకేశవులు, సూర్యాగ్నులు, దుర్గాసరస్వతులు మొదలగు దేవతలను సేవించి తరించిన భక్తుల చరిత్రములు— ఇవి యన్నియు మార్కండేయమున కలవు. కావున ఈ పురాణము హరిహరాద్వైత దృష్టితోడనే కాక తత్కాల సర్వవాఙ్మయప్రక్రియా సమన్వయ దృష్టితోడను విశేషప్రాముఖ్యము వహించుచు-

3)

పురాణపురుషునియందు బ్రహ్మాండమువలె పురాణమునందు సాహిత్యప్రక్రియా జగత్తంతయు ఇమిడియుండగలదను తత్త్వమునకు ఆదర్శప్రాయమై పరిఢవిల్లినది.

మారన పూరించిన మహాపురాణశంఖారావము తరువాతితరములవారికి పురాణానువాదస్వీకారోల్లాసమును రేకెత్తించినది. ఎఱ్ఱాప్రెగ్గడ, కమలనాభామాత్యుడు, శ్రీనాథుడు పోతన ఇంకెందరో ఈమార్గమున నడచిపోయిరి. మారన చుట్టిన శ్రీకారము ఆంధ్రమహాపురాణానువాదోద్యమమునకు శ్రీరామరక్ష.

మారనమహాకవి మార్కండేయపురాణమును భావానువాద పద్ధతి ననుసరించి అనువదించెను. కవిత్రయమువలె ఈతడు మూలమునందలి శాస్త్రార్థములను తగ్గించెను. ఉపాఖ్యానములలోని రసభావములనుమాత్ర మెచ్చుటను వీడియుండలేదు. వీలున్నచో వివేకముతో కథార్థములను పోషించియో పెంచియో క్రమబద్ధ మొనర్చియో, మధురతర మొనర్చియో కథలలో కావ్యకళాదృష్టి ప్రదర్శించెను. పురాణానువాదమునందు శాస్త్రోపదేశసౌరభము చెడకుండ కథాశిల్పసుమవైభవమును ఆతడు సంరక్షించెను. సంస్కృతమున అర్థప్రధానము లైన పురాణఘట్టములను మారన స్వీయకవితాశక్తితో శబ్దార్థోభయప్రధానములుగా నిర్మింపగలిగెను. స్వారోచిషసంభవ హరిశ్చంద్ర కువలయాశ్వ మదుత్తరాట్చరిత్రాదు లటువంటివి, అవి తరువాతిప్రబంధకవుల దృష్టి నాకర్షించినవి. కావ్యములుగా కాలాంతరమున అవతరించినవి. అట్లవతరించుటకు కథాశక్తియే కాక మారనకవితాశక్తియు ప్రధానహేతు వనుటలో విప్రతిపత్తి లేదు. మారన రసౌచిత్యదృష్టికి నరిష్యంతదమచక్రవర్తులకథలను అనువదింపకుండుటయే తార్కాణము. తెలుగులో వెలసిన హరిశ్చంద్రచరిత్రలు స్వారోచిషమనుసంభవాదులు మారనరచనాశిల్పమును మార్గదర్శకముగా పెట్టుకొని ప్రవర్తిల్లినవి, ప్రబంధకథామూల మైన మార్కండేయమునందలి మహత్తంతయు మారనకవితాశిల్పమునకు దక్కవలసియున్నది.

మారనఅనువాదము మూలాతివిధేయము కాదు. మూలభావావిష్కారమును స్వీయవ్యక్తిత్వముద్రతో ఒనర్చుట అతని ప్రత్యేకత. సారళ్యము వీడని గాంభీర్యము, మార్దవము వీడని ప్రౌఢిమయు, సౌకుమార్యము వీడని సమాససంఘటనము, సారము చెడని సంగ్రహత్వమును, రసదృష్టి వీడని కథార్థపోష

ణమును మారన కవితాశైలికి సహజాలంకారములు. ఇట్టిశైలి సర్వపురాణ సామాన్యముగా నుండదగినది పండితపామరులకు మొకట పురాణరచన శ్రవణానందము కల్పింపవలెను. కాని, పౌరాణికులు ప్రవచించుటకుగాని, బుధమండలిభావించుటకుగాని అందు అంతస్సార ముండవలెను. ప్రయత్న కృతాలంకారబంధుర మైన శైలియు, వక్రోక్తివైభవమును, దీర్ఘవర్ణనాసక్తియు గాఢపాకమును గల వాగ్వ్యుత్పత్తి పురాణకర్త కుండరాదు, కాని, నిరలంకార మయ్యు సాలంకారసౌందర్యస్ఫూర్తి గల ఒకానొక ప్రౌఢోక్తి పురాణకర్త కుండ వలెను. అట్టిది మారనరచనయందు ప్రత్యక్షమగుచున్నది. కావున మారన మహాకవిది అచ్చమైన ఆంధ్రపురాణశైలి. అతని మార్కండేయము ప్రథమాంధ్రమహాపురాణము.

# 6

అష్టాదశమహాపురాణము లన్నింటిలో భాగవతమునకు తాత్త్వికు లగ్ర తాంబూలమిచ్చి గౌరవించెదరు. వ్యాసున కెన్నిపురాణములు రచించినను చిత్తమునకు శాంతి చిక్కలేదు. వేదములను విభాగించి. వేదార్థములను పురాణముఖమున ప్రపంచించిన ఆమహర్షికి భక్తిరసప్రధాన మైన విష్ణుకథ లేర్పడ చెప్పినచో చిత్తశాంతి లభింపగల దని నారదుడు ప్రబోధించినాడట. వ్యాసు డాతనిసూచనను గ్రహించి మహాభాగవతమును రచించినాడట! అం దాతని జ్ఞానవిశిష్ట మైన మేధయు, భక్తిరసార్ద్ర మైన హృదయమును ఏకమై పరవళ్లు ద్రొక్కినవట. భక్తిముక్తులసంగమక్షేత్ర మైన భాగవతము పురాణ రత్నమై ప్రశస్తికెక్కినది.

పోతన్న జీవించినకాలము భాగవతము తెలుగున వెలయవలసిన కాలమున ఒకవైపు వీరశైవులభక్త్యావేశము బసవపురాణమున పొంగిపొరలుచున్నది. మరియొకవైపు మార్కండేయమున జ్ఞానదృష్టి కాంతుల నీనుచున్నది. బసవ పురాణమున భేదదృష్టి కాన్పించుచున్నది. తిక్కనమారననాచనసోమనాదులు హరిహరాభేదదృష్టిని సాహిత్యమున సారించియుండిరి. మార్కండేయము జ్ఞాన మందించినంతగా భక్తిని ప్రజలకు బోధింపలేదు. పురాణము ప్రజలకొరకై ఏర్పడిన సాహిత్యప్రక్రియ. ప్రజలు ప్రధానముగా హృదయవాదులు.

వారికి మొదట కావలిసినది భక్తి. అది జ్ఞానమునకు సోపానము కావలెను. మార్కండేయము భక్తు డందుకొనవలసిన శిఖరమును చూపించినది కాని, దాని నధిరోహించుటకు సోపానపంక్తిని నిర్మింపలేదు. బసవపురాణమునందలి వీర భక్తి సాత్త్వికభక్తిసాధన కనువైన మార్గము కాదు. అందువలన, కైవల్య సిద్ధికి అద్వైతభక్తిమార్గమును ఆంధ్రజాతి అన్వేషించుచుండెను. ఆంధ్రులతపః ఫలమో అనునట్లు బమ్మెరపోతన తెలుగునాట జన్మించినాడు. భక్తియోగమును భాగవతరూపముగా తెలుగువారి కందించి తెలుగులో పురాణరత్నమును ప్రభవింప చేసినాడు. భక్తులకు జ్ఞానులకు భాగవత మొక కల్పవృక్షమై ఆకల్పాంతకీర్తిని గడించుకొనినది.

లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయ మై.

ఇది మహాభాగవతప్రశస్తికి పతాకవంటి పద్యము. భాగవతము భక్తిముక్తు లను ప్రసాదించు పురాణకల్పవృక్షము. భక్తశిఖామణి యైన పోతన శ్రీకైవ ల్యపదంబు చేరుటకునై భక్తపాలనకళాసంరంభుడైన భగవంతునికి చేయు ఆరాధనావిశేషముగా తనకవితను భావించిన పుణ్యాత్ముడు. భాగవతము తత్త్వగంభీరమైన పురాణము. దానితాత్పర్యము సర్వము తెలిసిపలుకుట శూలికైనను, తమ్మిచూలి కైనను సాధ్యము కానిపని యని పోతన చెప్పుకొని నాడు. శ్రీధరపండితుని భాగవతవ్యాఖ్యాన మాతని భాగవతానువాదమున తోడ్పడినది. పోతనచిత్తమున భక్తిజ్ఞానములు రెండును పరిపక్వస్థితి నందినవి, తాను పలికెడు భాగవతమును రాముడే పలికించినా డను నిరహంకార ప్రవృత్తి అతనిది. భక్తివలన అతనికి కవితావేశ మబ్బినది. జ్ఞానమువలన భాగవత తత్త్వము కరతలామలక మైనది వినయమువలన శీలసంపద లభించినది. అతని వాక్పాకము పండితపామరులకు హృదయరంజక మైనది. అతనిభక్తికి వన్నె పెట్టినది అతని అద్వైతదృష్టి. భాగవతము విష్ణుమహిమను ప్రతిపాదించునది. పోతనచిత్తము హరిహరాభేదమును పాటించునది. అతనికి పరమేశ్వరధ్యాన మనినను, పద్మాక్షునికీర్తన మనినను ఒక్కటియే. ఆ అద్వైతసిద్ధియే అతనికి లేకపోయినచో ఆంధ్రభాగవతము ఒక వీరవైష్ణవపురాణ మై యుండెడిదేమో !

పోతనకవితకు ప్రాణము భక్తి; పరమార్థము జ్ఞానము. పోతన భక్తిలో తన్మయుడైనప్పుడే భాగవతరచనము సాగించెను. అంతరాత్మలో తరంగితమైన భక్తిభావలహరి కవితాస్రవంతిగా అతనినాలుకపై తురంగలించి పద్యతరంగములుగా భాగవతములో ప్రవహించినది. అతని మనఃప్రవృత్తియే భాగవతభక్తులలో ప్రతిబింబించినది. పోతనయే భాగవతభక్తులలో తాదాత్మ్యము చెంది కవితా వేణువు మ్రోగించినాడు. భాగవతకవితయంతయు అతని ఆత్మాశ్రయకవితా లహరిగా పొంగివచ్చినది. హరినామకీర్తనలో అతడు మైమరచి పద్యగీతముల నాలపించెడివాడు. అందువలననే మూలముకంటె అనువాదము మూడింతలు పెరిగినది. ప్రహ్లాదచరిత్రము, గజేంద్రమోక్షము, వామనావతారఘట్టము, శ్రీకృష్ణలీలలు, గోపికావిహారము, రుక్మిణీకల్యాణము, నరకాసురసంహారము– మొదలైన ఘట్టములలో పోతనరసావేశముతో మూలాతిరిక్తములైన రమణీయ పద్యములను కోకొల్లలుగా నిర్మించినాడు. తెలుగువారినోట తీయందనములు నింపుపద్యము లన్నియు అతనిహృద్యకల్పనామహనీయములే. 'చదివించిరి నను గురువులు'. 'తనుహృద్భాషల', 'ఇందేందూదయముల్' 'కమలాక్షునర్చించు కరములు కరములు', 'కంజాక్షునకుగాని', 'సంసారజీమూతసంఘంబు విచ్చునే', 'నాకుం జూడగ చోద్యమయ్యేటి కదా', 'కలడందురు దీనులయెడ', 'లావొక్కింతయు లేదు'. 'అల వైకుంఠపురంబులో', 'సిరికిం జెప్పడు', 'తనవెంటన్ సిరి', 'తమముం బాపిన రోహిణీవిభుక్రియన్', 'ఇంతింతై వటు డింతయై', 'రవిబింబం బుపమింప', 'పున్నాగ కానవే' 'నల్లనివాడు', ఏనీగుణములు కర్ణేంద్రియములు', 'ప్రాణేశ నీమంజుభాషలు వినలేని', 'పరుఁ జూచున్ వరుఁ జూచు', 'రాకేందుబింబమై రవిబింబమై' వంటిపద్యము లెన్నియో పోతనగంటము నుండి వెలువడిన స్వతంత్రసృష్టులే. ప్రజలనాలుకలపై పదికాలములపాటు నిలువగలిగిన పద్యరత్నము లిన్ని కలిగిన పురాణము తెలుగులో మరియొకటి లేదు.

ఆంధ్రభాగవత మహాపురాణమున పంద్రెండు స్కంధములు కలవు. ఆంధ్రమహాభారతమువలెనే భాగవతముకూడ ఒక్కనిచేతిమీద నడవలేదు. అక్కడ ముగ్గురు కవులు. ఇచ్చట నలుగురుకవులు. అందులో ప్రధానుడు బమ్మెరపోతన. భక్తిరసఘట్టము లన్నియు అతనిగంటమునుండి వెలువడుట తెలుగువారి అదృష్టము. మిగిలిన ముగ్గురిలో వెలిగందల నారయ ముఖ్యుడు.

ఏకాదశద్వాదశస్కంధములను, ద్వితీయదశమోత్తరస్కంధములలో కొంత భాగమును ఆతనిరచన. పంచమస్కంధమును గంగనకవియు, షష్ఠస్కంధమును సింగనకవియు తెనిగించినారు. పోతన గతించిన తరువాత శిథిలమైన భాగవతములను ఈ ముగ్గురుకవులు పూరించినారనియు, పోతనగారే వారిని ప్రోత్సహించి భాగవతరచనలో భాగస్వామ్యము కల్పించినారనియు కొన్నికథలు, వాదములు లోకమున కలవు అందు రెండవవాదమును పలువురు విశ్వసించుచున్నారు. ఏమైనను భాగవతకర్తలలో కవితాశక్తియందు బమ్మెరపోతనదే అగ్రతాంబూలము.

'తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం
బను నీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్, హరిన్ నమ్మి, స
జ్జనుఁడై యుండుట భద్ర మంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!'

అని ప్రహ్లాదునినోట చెప్పించిన నవవిధభక్తిమార్గములను భాగవతమునందు నవనవోన్మేషముగా పోషించినవాడు పోతన. భగవద్విధేయులైన భక్తులనోట పరమ రమణీయముగా భక్తిని పొంగించుటయే కాక భగవద్విరోధులనోటకూడ నిందలో స్తుతిని గూఢముగా అనుసంధించినాడు పోతన. త్రిగుణాత్మకచిత్తవృత్తులలో, స్త్రీపుంసజడ ప్రవృత్తులలో, సిద్ధసాధకముగ్ధభేదావస్థలలో భక్తి ఎన్నిశాఖోపశాఖలుగా విస్తరించునో ఉపాఖ్యానపాత్రచిత్రణములందు ఉజ్జ్వలముగా ప్రపంచించి చూపినాడు పోతన!

కవితలో భక్తి రక్తి కట్టవలె నన్నచో శ్రవణము, సంకీర్తనము, చింతనము-అను భక్తి మార్గముల కది పరిపోషకముగా ఉండవలెను. కవితకు లలిత శబ్ద సంయోజనము వలనను, మధురాక్షర పునరావృత్తి వలనను, వృత్త్యనుప్రాసాది శబ్దాలంకార సంవిధానము వలనను శ్రవణ సుభగత్వ మలవడగలదు. ధారావాహితమైన కవిత్వము వలనను, భగవద్గుణ సంకీర్తనము వలనను, రాగ రంజితమైన శైలివలనను, అలవోకగా అవధానము చేయుట కనువైన పద్య రచనము వలనను కవితకు సంకీర్తన సౌలభ్య మేర్పడును. భావనా గంభీరములైన అర్థాలంకారముల వలనను, ఆలోచనామృతము నందించు తాత్త్విక తాత్పర్యముల వలనను, వ్యంగ్యసౌరభమును వెదజల్లు శబ్దవాక్య విన్యాసముల వలనను

కవిత్వము పరిశీలతో చింతనము రేకెత్తింపవలయును. బమ్మెర పోతన కవిత్వ మీ లక్షణముల నన్నింటిని సలక్షణముగా సమన్వయించుకొనినది. పోతన కవిత చదివిన తెలుగువాడు మరొక గ్రంథమును చేపట్టునప్పుడు- 'మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు'- అని మనసులో తలపోయక పోడు!

ఆంధ్ర పురాణ రచనలో భాగవత మొక విశిష్ట ప్రమాణమును సృష్టించినది. పురాణ మనగా భక్తి జ్ఞానములకు దివ్యరసాయనము కావలె నను భావము తెలుగువారికి కల్పించినది. బసవ పురాణమున భక్తి కలదు. కాని, అది వీర భక్తి. భాగవతమున అది మధురభక్తిగా సాక్షాత్కరించినది. మార్కండేయమున జ్ఞానదీప్తి కలదు. భాగవతమున ఆజ్ఞానదీప్తి భక్తి కవితలో రక్తి కట్టినది. ఈ సమన్వయము భాగవత రచనము తరువాత 'న భూతో న భవిష్యతి' అయినది. అందువలననే తెలుగువారు గర్వకారణముగా చెప్పుకొను ఏకైక మహాపురాణము ఆంధ్ర భాగవత మై నిలిచిపోయినది. ఆంధ్ర పురాణ వాఙ్మయమున పోతన భాగవత మొక్కటి ఒకయెత్తు: మిగిలిన పురాణములన్నియు ఒకయెత్తు.

పోతన గారికి ఇతర ప్రాంతములో నున్న ప్రచారముచు గూర్చి శ్రీపుట్టపర్తి నారాయణాచార్యుల వా రిట్లనుచున్నారు, "మన భాషతో సంబంధము లేని యితరులకు తెలిసిన కవులు తెనుఁగులోఁ గొందఱున్నారు. వారిలో మొదటివాఁడు పాలకురికి సోమనాథుఁడు. రెండవవాఁడు పోతనామాత్యుఁడు. సోమనాథుని పేరు కన్నడిగులకుఁ బరిచిత మైనది. అతఁడు వీరశైవుడు గనుక, విధిగా కన్నడము నేర్వవలసి వచ్చెను... సోమనాథుఁడు కన్నడములో- తెలుగులోవలె ప్రసిద్ధ కవి కాకపోయినను కవిత్వము వ్రాసెను. తమిళమున గూడఁ గొంత యాతని పేరు ప్రాకినది. కాని, యీ ప్రాకుట యంతయు మతాభినివేశముతోనే. పోతనామాత్యుల స్థితి యది గాదు. అతఁడు తెన్గుదేశపు టెల్లలు దాటి పోలేదు. తెన్గు దేశమునను నలుమూలలు దిరిగి యుండఁడు. అతఁడు విరక్తుఁడు. ప్రాప్తమైన దానితో తృప్తిపడువాఁడు. అతని కితర భాషలలోఁ బ్రవేశ ముండె నని యూహించుట కారచనలో గుర్తులు లేవు. కాని, యాతనికిఁ గవిగా వచ్చిన దానికంటె భక్తుఁడుగాఁ గల్గిన కీర్తి దొడ్డది. ఆనాటి భాగవతులలో నాతఁడు నాయక రత్నము. ఈ ప్రసిద్ధి మాత్రము హనుమంతునితోఁకవలె పెరుగుచునే పోయెను. సమర్థ రామదాస స్వామివారి సాంప్రదాయిక గ్రంథములలో- మహాభక్తుఁడుగ

పోతన్న వర్ణింపఁ బడినాఁడు. ఆ సన్నివేశ మిది. సమర్థ రామదాసు 'మేరు పర్వతము'ను దర్శించివచ్చెనట! అ దెట్లు సాధ్యము? అంతవఱకును బోవుటకు వారెంత వారైనను మానవులకు శక్తిలేదే! యనుశంక శిష్యులకుఁ బొడమెను. దానిని సమర్థించుటకు వారు పోతన్న నుదాహరణముగ దీసికొన్నారు. 'అల వైకుంఠ పురంబులో' అని పోతన్న పద్య మారంభించెనఁట! తరువాత నాకనికిఁ దోఁచలేదు. రామభద్రునిదయతో వైకుంఠము నాతఁడు చూచివచ్చి శేషమును బూరించినాఁడట! పోతన్న వైకుంఠమును జూచివచ్చెనా? లేదా? అట్లు చూచివచ్చుటకు సాధ్యమా? యను ప్రశ్నల కిక్కడ చోటు లేదు. ఈ కథ నుదాహరించుటలో నా అభిప్రాయము పోతనామాత్యుఁడు మహారాష్ట్రులకుఁ బరిచితుఁ డని తెలుపుట వరకే! ఉత్తర హిందూస్థానమున 'తెలాంగు' లను నొకశాఖవారున్నారు. రాజస్థానము గుజరాతులలో వా రెక్కువ. ఆ బ్రాహ్మణులు దాక్షిణాత్యులు. వల్లభాచార్యుల కాలమున దక్షిణమునుండి యార్యావర్తమునకు కదలిపోయిరి. వారికి మన భాగవతముపై నభిమానము కలదు. ఈ విషయమును నేను ఢిల్లీలో వింటిని. త్యాగరాజు తమిళ దేశమునందు తెనుఁగు భాగవతమునకు ప్రచార మెక్కువ యిచ్చినట్లున్నది. నాఁడు ప్రచారమనగా దానిని తా ననుష్ఠించి చూపుట. త్యాగయ్య దినమును తెనుగు భాగవతమును పారాయణ మొనరించెడువాఁడట! ఈ నాటికిని మన కామాత్ర మభిమాన ము ఆంధ్ర గ్రంథములపై నేర్పడలేదు. తెనుఁగు కవిత్వము నెంత మెచ్చుకొన్నను మడుగు గట్టికొన్నప్పుడు మాత్రము మనకు జ్ఞాపకమునకు వచ్చునవి సంస్కృత గ్రంథములే. ఉత్తర హిందూస్థానమున నొక సంప్రదాయ మున్నది. వాఁడు చతుశ్శాస్త్ర పండితుఁడైనను సరే రామాయణ మన్నంతనే తులసీ రామాయణమునే పారాయణము సేయును. ఇంత ముష్కరత మన కక్కర లేకున్నను సంస్కృత గ్రంథములలోనే మోక్షము కల దనియు వానినుండి మూటలు గట్టికొని రావచ్చు ననియు తలచు పేరాసమాత్రము నవ్వవలసినంత మూర్ఖత. భావశుద్ధి ఫలసిద్ధికి ప్రధాన కీలకము."[21]

21. ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు. పుట. 155-157.

# 7

అష్టాదశ మహాపురాణములలో పదుమూడు మాత్రమే తెలుగున సంపూర్ణముగా అనువదింపబడినవి. స్కాందము, వాయ్వగ్నిభవిష్యద్బ్రహ్మవైవర్త పురాణములు తెలుగున అనువదింపబడలేదు కాని వానిలోని కథలు, ఖండములు మాత్రమే అనువదింపబడినవి. పైపురాణములలో ప్రాచీనకవులరచనలు కొన్ని లభ్యము లగుటలేదు. లభ్యములగుచున్నవానిలోను ప్రశస్తి రెండుమూడింటికి మాత్రమే.

తెలుగున వెలువడిన పురాణములు చాలవరకు గద్యపద్యాత్మకములే. ద్విపదరచనలు కొన్ని కలవు. వచనమున వెలువడినపురాణములు సమగ్రములు కావు కాని, సారసంగ్రహరూపములు. అష్టాదశపురాణసార మంతయు వచన రూపమున వచ్చుట ఒక విశేషము. సామాన్యజనుల కాయా పురాణసార మంతయు వచనరూపమున వచ్చుట ఒకవిశేషము. సామాన్యజనుల కాయాపురాణ ప్రధానాంశముల నెఱుగుట కది తోడుపడినది.

ఆంధ్ర సాహిత్యమున భాగవత మార్కండేయ పురాణముల తరువాత ప్రసిద్ధి కెక్కినది వరాహ పురాణము. ప్రబోధ చంద్రోదయ మను వేదాంత ప్రబంధమును రచించిన జంటకవులు- నంది మల్లయ ఘంట సింగయ లీపురాణ కర్తలు. ఇది శ్రీకృష్ణ దేవరాయల తండ్రి యగు తుళువ నరసరాయల కంకిత మీయబడినది. కర్ణాటక సామ్రాజ్యాధిపతులకు 'ధరణీవరాహ' అను బిరుద ముండెడిది కావున ఈ జంటకవులు వరాహపురాణాను వాదమును చేపట్టి యుందు రని శ్రీ ఆర్ద్ర భావించినారు.[22] పేరున కిది వరాహపురాణ మైనను వరాహా వతార ఘట్ట మిందు వర్ణింపబడలేదు. ఆది వరాహ మూర్తి భూదేవికి వ్రతదాన విశేషాదులు చెప్పుటను బట్టి ఈ పురాణమున కాపేరు వచ్చినట్లు కానబడుచున్నది "బహుళ ప్రఖ్యాతి గాంచిన గాథ లెవ్వియు దీనియందు లేకపోయినను అనేకము లగు చిన్నచిన్న పుణ్యకథలు, ముఖ్యముగా వైష్ణవులలోను, స్మార్తులలోను సామాన్యముగా నాచరింపబడు వ్రతదానముల పుణ్యకథలు దీనియందు పెక్కులు కాన్పించుచున్నవి. ప్రతి కథయందును వ్రతవిధానము, ఆవ్రతము నాచరించిన యొకానొక మహాపురుషుని ప్రశంసయు, అతఁ డనుభవించిన వ్రతఫలమును-

---

22. సమగ్రాంధ్ర సాహిత్యం. 6వ సంపుటము. పుట 238.

ఇత్యాదులు లెక్కకు మిక్కిలి వక్కాణింపబడినవి. పాడ్యమి మొదలు పూర్ణిమా మావాస్యల వఱకు ప్రతిదినము నాచరింపదగు వ్రతములును, దానములును, చైత్ర మాసము ప్రభృతి ఫాల్గుణ మాసాంతము వరకును ననుష్ఠింపదగు వ్రతములును, దానములును సక్రమముగా, సచరిత్రముగా నిరూపింపబడినవి. ధరణీ వ్రతము, రుద్ర వ్రతము, ధన్య వ్రతము, పద్మనాభ వ్రతము, కాంతి వ్రతము, శుభ వ్రతము, కామ వ్రతము, సార్వభౌమ వ్రతము, ఇత్యాదులును, తిలాదిత్రయోదశ దానములును, గోదానము, హేమకుంభదానము ఇత్యాదులును ఈ గ్రంథమునందు సగము భాగమునకు పైగా వ్యాపించియున్నవి. మిగిలిన భాగములో స్థల మాహాత్మ్యములు అనగా సొనందూర మాహాత్మ్యము, లోహార్గళ మాహాత్మ్యము, మధురా మాహాత్మ్యము, గోకర్ణ మాహాత్మ్యము మున్నగునవి పెక్కులు గలవు. ప్రాచీన భూగోళవర్ణనము సప్త ద్వీపములు, సప్త మహోదధులు. సప్తకుల పర్వతములు, మహానదీనదములు, పశువృక్షాది విశేషములు–ఇత్యాది వివరణములతో సువిశేషముగఁ జేయఁబడినది. నాచికేతోపాఖ్యానమనుగాధ యిందు ప్రాసంగికముగాఁ జేర్పఁబడినది."[23] ఈ జంటకవులు మూలమునందలి వ్రతదాన మాహాత్మ్యములను వర్ణించుభాగము విస్తరించి రచించి స్థల మాహాత్మ్యముల భాగమును వదలివైచిరి. ఉపాఖ్యానములను రసవత్తరములైన వర్ణనలతో పెంచి రచించి భావిప్రబంధ నిర్మాణమున కనువైన బాటలు ఈ జంటకవులు చూపించిరి. ఉదాహరణమున కీపురాణమునందలి దుర్జయోపాఖ్యానము గ్రహింపవచ్చును. మూలమునం దిది చిన్నకథ. దాని నీకవులు వివిధ వర్ణనలతో పెంచి రచించిరి. దుర్జయుని జన్మము, సద్యోయౌవనము, దిగ్విజయము, వనవిహారము, సుకేశీమిశ్రకేశీ విరహము, దుర్జయ వివాహము, పుత్ర జననము–అను అంశములతో ఈ కథ యొక ప్రబంధ గౌరవము సంతరించుకొనినది. ఇట్టివే ధర్మవ్యాధోపాఖ్యానము, గౌతమ్యుపాఖ్యానము మొదలైనవి. ఈ జంటకవులు తమ పురాణమున శ్రీనాథాదులవలె ప్రౌఢ వర్ణనలను చొప్పించుటతోపాటు చిత్ర కవిత్వమును గూడ వెలయించిరి. ఆంధ్ర పురాణములలో ప్రబంధ గౌరవమబ్బిన పురాణములలో వరాహపురాణ మొకటి!

మార్కండేయ పురాణమును క్రీ. శ. 1540 ప్రాంతమువాడైన పొన్న-

23. విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము–లేక. మల్లంపల్లి అచ్యుతరావు. పుట 255.

తోట ఔబళకవి అంధ్రీకరించినట్లు అతని వామన పురాణావతారిక ననుసరించి తెలియుచున్నది. కాని, ఈ గ్రంథము లభించుట లేదు. ఈతని మార్కండేయ వామన పురాణములు రెండును రాణా, జగదేక భూపతి కంకితములు. క్రీ. శ. 19 శతాబ్ది చరమపాదమున నున్న మంద కామేశ్వర కవి 'ఈ మహాపావనమౌ పురాణమును బట్టి తెనుంగున గూర్తు నంతయున్ అని యథామాతృకముగా నాంధ్రీకరించెను. మారనతో పోల్చి చూచినచో ఈ కవి యతనికి దీటు రాక పోవచ్చును గాని యథామూలముగా తెలుగున సలలితమైన శైలిలో మార్కండేయమును సమగ్రముగా ననువదించిన కవులలో కామేశ్వరకవికి సముచిత స్థానము కలదు. మార్కండేయ పురాణసారమును వచన కృతులుగా వెలయించిన వారిలో- తిమ్మరాజు లక్ష్మణార్యుడు, నోరి గురులింగశాస్త్రి, కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు, వేమూరు జగన్నాథ శర్మగారలు ముఖ్యులు.

క్రీ. శ. 14వ శతాబ్దమున పశుపతి నాగనాథకవి విష్ణుపురాణము నాంధ్రీకరించినట్లు ప్రబంధరత్నావళిలో ఉదాహరింపబడిన పద్యమువలన తెలియుచున్నది. కాని, ఆకృతి మనకు లభించుట లేదు. అట్లే దిట్టకవి వెంకటామాత్యుడు(17వ శ.), ముమ్మంబై దీక్షితులు(18వ శ.), సీతారామసిద్ధాంతి అనువారు విష్ణుపురాణమును గద్య పద్యములో రచించినట్లు తెలియుచున్నది. తుపాకుల అనంతభూపతి (18వ శ.), నోరి గురులింగశాస్త్రిగార లీపురాణసారమును వచనకృతులుగా సంతరించిరి.

ప్రసిద్ధకాశీపండితు డైన పశుపతి చిదంబరశాస్త్రి పద్మపురాణము నాంధ్రీకరించెను. అది మూలమునకు అతిసన్నిహితముగా నున్న దని పండితు లభిప్రాయపడుచున్నారు. పాతాళఖండమునందలి స్వర్గఖండ మిందు కానరాదు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి నారదీయమహాపురాణము ననువదించె నని తెలియుచున్నది. కాని అది లభించుట లేదు. ఈపురాణము ననువదించిన ఇతరకవులలో వాసి రామయ్య, కొత్తలంక మృత్యుంజయకవి, ఆల్లాడ నరసింహకవి ముఖ్యులు.

కళాపూర్ణోదయకర్త యగు పింగళిసూరన గరుడపురాణమును అనువదించె నని అతని కావ్యావతారికలవలన తెలియుచున్నది. అట్లే మత్స్యపురాణమును లింగమగుంట రామకవి (17వ శ.), కాణాదము పెద్దన (18వ శ.), మండ కామేశ్వరకవులును, వామనపురాణమును ఎలకూచి బాలసరస్వతి, లింగమ

గుంట రామకవి, బొబ్బిలకవి, రామావఝ్ఝుల కొండయ్యశాస్త్రిగారలును, కూర్మ పురాణమును రామలింగకవియు (17 శ.), మండ కామేశ్వరకవియు (19 శ.), లింగపురాణమును తెనాలి రామలింగకవియు, ములుగు చంద్రమౌళిశాస్త్రియు అనువదించిరి.

భాగవతానువాదములలో మొదట పేర్కొనదగినది మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిది. భారతభాగవతముల నొక్కచేతితో తెలుగున రచించి వాసి కెక్కిన విద్వత్కవి ఆయన. ఆతరువాత డేకుమళ్లరంగశాయిగారి ద్విపదాభివాదమును, శ్రీరామనరసింహకవుల (గంధము శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహకవి) గద్యపద్యానువాదమును పేర్కొనదగినవి.

బ్రహ్మాండపురాణమును కావూరి యెల్లయకవియు (16 శ.), జనమంచి శేషాద్రిశర్మగారును తెలుగుచేసిరి. జనమంచివారి బ్రహ్మాండపురాణమునకు మంచి ప్రశస్తి కలదు. వీరే బ్రహ్మపురాణమునుగూడ యథామూలముగా అనువదించిరి. కల్లూరి సుబ్రహ్మణ్యదీక్షితులును, ఓలేటి వెంకటలక్ష్మీనరసింహశర్మగారును అష్టాదశమహాపురాణముల సారమును సరళగ్రాంథికశైలిలో వచనమున వెలయించి పురాణ వాఙ్మయమునకు ఎనలేని సేవ గావించిరి.

# 8

ఆంధ్రసాహిత్యమున మహాపురాణానువాదమున కెంత ప్రాముఖ్యము కలదో పురాణఖండానువాదమునకు అంత ప్రాచుర్యము కలదు. పురాణములలో సర్గప్రతిసర్గాదులు, ధర్మశాస్త్రవిషయములు, భూగోళవర్ణనము మొదలైన అంశములలో రసవత్కథార్థముల కంతగా వుండదు. రసలుబ్ధులైన తెలుగుకవులు పురాణానువాదము చేపట్టునవసరమున అట్టిభాగములను వదలి రసభావముల కాకరములైన ఉపాఖ్యానములు విస్తారముగా నున్న భాగములను చేపట్టి కావ్యస్పృహతో వానిని పెంచి ప్రబంధములుగా తీర్చిదిద్దుటకు యత్నించిరి తెలుగు కవుల ఇట్టిప్రయత్నమే పురాణఖండానువాదప్రక్రియకు దోహదము కల్పించినది.

సంస్కృత పురాణములలో స్కాందము కడువిస్తారమైనది. అందలి ఒక్కొక్కఖండమే ఒక్కొక్క పురాణమువలె భాసిల్లును. స్థలదేవతీర్థమాహా

త్మ్యముల కాపురాణము కాణాచి. ఆపురాణఖండముల సంఖ్యలుగురించియు, వాని ప్రక్షిప్తాప్రక్షిప్తత్వత్వములను గురించియు విమర్శకులలో వాదోపవాదము లనేకములు కలవు, వాని నిక్కడ వివరించుటకు స్థలము లేదు పుష్పక విమానమువంటి ఆపురాణమును సమగ్రముగా అనువదించిన కవి లేడు, అందలి ఖండములను గైకొని పురాణములుగా అనువదించినవారిలో శ్రీనాథుడు అగ్ర గణ్యుడు.

శ్రీనాథమహాకవి స్కాందమునందలి గోదావరీకాశీఖండములను తెలుగున వర్ణనామహనీయముగా వినిర్మించెను. గోదావరీఖండము తెలుగున భీమేశ్వర పురాణ మైనది. అందు సప్తగోదావరీతీర్థమహిమాదికములును, భీమేశ్వరస్వామి మాహాత్మ్యములును ప్రధానవర్ణ్యవస్తువులు. మూలకర్త తీర్థము నధికరించియు, అనువాదకర్త దైవము నధికరించియు నామము లుంచినట్లు స్పష్టము. శ్రీనాథుడు దక్షిణకాశి యని ప్రసిద్ధిగాంచిన దాక్షారామమును, తన్నాయకుని, తన్మండల ములను ఆంధ్రదేశాభిమాన ముట్టిపడునట్లు నోరార వర్ణించి చరితార్థ డయ్యెను.

"ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు
సప్తగోదావరజలము తేనె
బ్రహ్మసంవేద్యాది బహుతీర్థములు రేకు
లకరులు చారుదివ్యస్థలములు
నాళంబు లవణాబ్ధివేలావిభాగంబు
కల్యాణభోగమోక్షములు తావి
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు
గౌతమీ సింధు కౌంతేయ కణ్వనదులఁ
దుల్యభాగయు నేతేరు దమ్మికొనలు
భువనసంభావ్య మైన యీపుణ్యభూమి
యనఘ! సంసారతాపశాంత్యౌషధంబు!"

కన్నతల్లి, జన్మభూమి- ఈ రెండును స్వర్గముకంటె గొప్పవి. శ్రీనాథుడు తెలుగువాడై పుట్టుట ఆంధ్రమాత పుణ్యఫలము. అతడు ప్రౌఢనిర్భరవయః పరిపాకమున భీమనాయకుని మహిమ కొనియాడినాడు. ఆంధ్రభూమికి నడిమిగ

డైన భీమమండలము అతనికి పుండరీకముగా దర్శన మిచ్చినది. భీమేశ్వరు డాపద్మసన్నిధానమున అవతరించిన రాజహంస. ఎంత చక్కని రూపకల్పన! భీమేశ్వరు డెంతమహాదేవుడో అంతటి వేశ్యాభుజంగుడు. ఆదిదేవున కారసికత్వము నంటకట్టినది శ్రీనాథుడే. భీమఖండములో శ్రీనాథుడు తెలుగునేలను తనివితీర వర్ణించినాడు. మూలములో లేని రాజమహేంద్రవరమును రాణకెక్కునట్లు కీర్తించినాడు. కావ్యమంతయు క్షేత్రవర్ణనమే. దాక్షారామము, భీమేశ్వరాలయము, పంచారామములు. పంచతీర్థములు. సప్తగోదావరి, ద్వాదశతీర్థములు తుల్యభాగానదీతీరదేవతలు, పట్టిస్థానము, పుండరీకాద్రి, కుమారారామము, కుక్కుటేశ్వరము, కోటిపల్లితీర్థము, బ్రహ్మసంవేద్య విష్ణుసంవేద్యములు మొదలైన తీర్థక్షేత్రములన్నియు శ్రీనాథునికృతులలో రసాకృతులతో ప్రత్యక్షమగును. భీమేశ్వరునితోపాటు గ్రామదేవతలను, వారిఉత్సవవిశేషములను సైతము శ్రీనాథుడు శ్రద్ధతో వర్ణించినాడు. వేశ్యలవిలాసములనుండి వేల్పుల మాహాత్మ్యములవరకు తెలుగువారి ఐహికాముష్మికజీవితచిత్రమును భీమేశ్వర పురాణములో శ్రీనాథుడు వర్ణరంజితముగా చిత్రించినాడు. సమకాలీనజీవిత సత్యముల కాపురాణము సరసవ్యాఖ్యానము.

భీమేశ్వరపురాణము శ్రీనాథుని స్వతంత్రరచనమనియు. అతనికృతియే సంస్కృతీకరింపబడి స్కాందమున నెక్కింపబడె ననియు పండితులు బలముగా నమ్ముచున్నారు. అది నిజము కావచ్చును. అయినచో-అమరభారతికి అర్పించిన ఈఆంధ్రపురాణము శ్రీనాథుని ఆంధ్రాభిమానమునకు అక్షరనీరాజనము.

కాశీఖండ మయఃపిండ మని ప్రసిద్ధి. ఈశ్వరార్చనకళాశీలు డైన శ్రీనాథుడు స్వయముగా కాశిని దర్శించి, తన్మహిమను తనివిదీర కాశీఖండమున అభివర్ణించెను. కాశీఖండము వారణాసిక్షేత్రమాహాత్మ్యమును వర్ణించు స్థల పురాణము, స్థలదేవతీర్థమహిమాభివర్ణనమే అందులోని వస్తువు. ఈపురాణములో రసదృష్టికంటె పుష్కలమైన వర్ణనదృష్టి అధికము. విసుగు కలుగని వైవిధ్యముతో వర్ణన చేయుటయే శ్రీనాథు డిందు ప్రదర్శించిన ప్రజ్ఞ. అగస్త్యుడు వింధ్యను దాటివచ్చుట, శివశర్మోపాఖ్యానము, కళావత్యుపాఖ్యానము, గుణనిధి కథ, వ్యాసుడు కాశిని బాసినకథ-మొదలైన ఉపాఖ్యానములు కాశీఖండములో కర్పూరఖండములవలె వెలుగొందుచున్నవి. వానిలో గుణనిధికథ గుణములో

గొప్పది. కాశీఖండములలో కథల కెంత ప్రాధాన్యమున్నదో వర్ణనల కంత ప్రాముఖ్యా మున్నది.

శ్రీనాథుని అనువాదము యథామూలము కాదు. మూలమునందలి భావమును గ్రహించి స్వీయప్రతిభావిలసితములైనకల్పనలను, వర్ణనలను జోడించి ఈరెండు కృతుల నాతడు నిర్మించెను. వ్యాసుడు కాశిని బాసిన ఘట్ట మీరెండు పురాణములలో రసవత్తరముగా చిత్రింపబడినది. ఈకృతులప్రశస్తికి వానియందలి వస్తువే కాక శ్రీనాథకవితాశక్తియు ప్రధానహేతువు. శ్రీనాథుడీపురాణములను రచించినతీరు భావిప్రబంధనిర్మాణమునకు రూపురేఖలు సంతరించినది. కాశీఖండమును యథామాతృకముగా అనువదించిన మరియొకకవి క్రీ.శ. 18వ శతాబ్దిఉత్తరార్థమున నున్న నంజరాజు.

స్కాందమునందలి కేదారఖండమును, అరుణాచలఖండమును పెదపాటి సోమయకవి (16శ.)యు, కేదారకౌమారికాఖండములను జనమంచి శేషాద్రి శర్మగారును అనువదించిరి. అట్లే నాగరఖండమును తురగా రాజకవియు, అయ్యంకి బాలసరస్వతియు (16శ.), జనమంచి పట్టాభిరామశాస్త్రియు, బ్రహ్మోత్తరఖండమును పిడుపర్తి బసవనయు, లింగనారాధ్యుడును. శ్రీధరమల్ల వెంకటరామకవియు, ముత్తురాజువెంకటకృష్ణకవియు, ప్రాతకోట మల్లయకవియు, పట్టమట్ట సోమనాథసోమయాజియు అనువదించిరి. బ్రహ్మోత్తరఖండమందలి విభూతిరుద్రాక్షమాహాత్మ్యములను పోచిరాజు వీరకవి అనువదించెను. శివరహస్యఖండమును కోడూరి వెంకటాచలకవియు, వంకాయలపాటి వీరభద్రకవియు, రేవూరి అనంతసోమయాజియు, ములుగు అయ్యవార్లును తెలుగుచేసిరి. బౌఖళకవి దీనిని ద్విపదకృతిగా సంతరించెను. ధర్మఖండమును ఏదులపల్లి భవానీశకవియు శ్రీశైలఖండమును పాదుర్తి అక్కయదేవరయు, అత్తలూరి పాపయకవియు అనువదించిరి. శేషయారాధ్యుడు శ్రీశైలఖండమును పర్వతపురాణమనుపేర నిర్మించెను. పాపయామాత్యుడును, దామెర వెంకటకవియు సేతుఖండమును తెనుగు కృతులుగా రచించిరి. పట్టమట్ట సోమనాథసోమయాజి సూతసంహితను మూలానుసారముగా ఆంధ్రీకరించెను. శంకరసంహిత కనువాదము లైన శిథిలతాళపత్రగ్రంథములు రెండు కానవచ్చుచున్నవి కాని వానికర్త లెవరో తెలియుట లేదు. శివరామలింగకవి వీరశైవాచారసంగ్రహ మనుపేర దీనిని అనువదించెను. ఈ ఖండమునందలి హాలాస్య మాహాత్మ్యమును నంజరాజు వచనకృతిగను, మల్లంపల్లి

బుచ్చికవియు, జనమంచి శేషాద్రిశర్మగారును పద్యగద్యకృతులుగను అనువదించిరి. స్కాందపురాణేతిహాసమంజరి అనువచనగ్రంథమును నోరి గురులింగశాస్త్రిగారు రచించినట్లు తెలియుచున్నది, ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు శివరహస్యఖండము ననువదించిరి. చాగంటి భాస్కరలింగశాస్త్రిగారు ప్రభాసఖండము ననువదించినట్లు తెలియుచున్నది.[24]

స్కాందపురాణముతరువాత తెలుగున ఖండానువాదములకు ప్రసిద్ధిగాంచినది పద్మపురాణము. శ్రీనాథుని పితామహుడైన కమలనాభామాత్యుడు పద్మపురాణోత్తరఖండమును అనువదించె నని తెలియుచున్నది. కాని, అది నేడు లభించుటలేదు.

క్రీ. శ. 15వ శతాబ్ది ప్రథమపాదమున మడికి సింగన రచించిన పద్మపురాణోత్తరఖండము 11ఆశ్వాసముల గ్రంథము. అది వానసవంశీయుడైన కందనామాత్యున కంకితము. ఆంధ్రపద్మపురాణములలో ఈకృతికి మిక్కిలి ప్రశస్తి కలదు. ఇందు రామావతార కథలును, కృష్ణావతారకథలును ఉండుటచే మడికి సింగన కవితాభినివేశముతో ఆఘట్టములను వర్ణించెను. అంతియకాక మాఘస్నానమాహాత్మ్య మీగ్రంథమున విశేషించి చెప్పబడినది. ద్వితీయాశ్వాసమునుండి షష్ఠాశ్వాసమువరకును ఈపురాణమున ఉపాఖ్యానము లధికముగా నున్నవి. వానిని చిత్రించుటలో సింగన రసాభినివేశమును ప్రకటించినాడు. అహల్యాసంక్రందనులకథలో శృంగారప్రబంధచ్ఛాయలు ప్రదర్శించినాడు. రుక్మిణీకల్యాణఘట్టమున తిక్కనవలె తెలుగువారి పెండ్లిండ్ల ఆచారములను పొందుపరచినాడు. మడికిసింగన రచించిన మరొకగ్రంథము భాగవతదశమస్కంధము. ఇది ద్విపదకృతి. ఇందులో మధురకాండ, కల్యాణకాండ, జగదభిరక్షకాండ- అను మూడుకాండ లున్నవి. ఈకృతిలో సింగన వర్ణనాభినివేశమును వదలి కథాకథన పద్ధతి నెక్కువ ఆశ్రయించెను. సింగన పైరెండుకృతులలోను నరకాసురవధావృత్తాంతమును వర్ణించినాడు. కాని, వానిలో సత్యభామయుద్ధమును చెప్పలేదు. అట్లే రుక్మిణీకల్యాణమును రెండింటను చెప్పినాడు. వానిలో రుక్మిణి పురోహితకుమారునితో కృష్ణునకు రాయబార మంపినట్లు కొలదిగామార్చి కథ నల్లినాడు. మొత్తమునకు ఈతనిరచనలో శృంగారవర్ణనాభినివేశము

24. వివరములకు చూడు : Telugu Versions of the Puranas – by Dr. K. V, Ramakoti Sastri, Purana - Vol. IV No. 2,

మెండుగా కానవచ్చుచున్నది. "శృంగారరసకళాశ్రితవబోధను" దను బిరుదములు అతడు ఆశ్వాసాంత గద్యలలో స్వయముగా పేర్కొనినాడు. ఇట్టి రసపోషణ దృష్టియే అతనిపురాణమునకు ప్రశస్తి తెచ్చిపెట్టినది.

కామినేని మల్లారెడ్డి ఈపురాణములోని రామావతారకథాఘట్టములలో కొన్నింటిని పెంచి రచించి పద్మపురాణ మనుపేర వెలయించినాడు. అతని మరియొకకృతి శివధర్మోత్తరఖండము. పద్మపురాణమునందలి మాఘమాహాత్మ్యమునే ప్రత్యేకించి అనువదించినవారు కొందరున్నారు వారిలో-పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, రామగిరి సింగనకవియు, పశుపతి సుబ్బరాయకవియు, వేదాంతము శేషాచార్యకవియు ముఖ్యులు. పాద్మమునందలి పాతాళఖండము లోని రామాశ్వమేధఘట్టమును త్రిపురాన వెంకటసూర్యప్రసాదరాయకవి ఆంధ్రీ కరించెను.

తెలుగున వెలసిన విష్ణుపురాణములలో వెన్నెలకంటి సూరనకవి (16 శ.) అనువాదము ప్రసిద్ధి కెక్కినది. విష్ణుపురాణమున పూర్వోత్తరఖండములు రెండు కలవు. వానిలో పూర్వఖండమున విష్ణుమాహాత్మ్యమును తెలుపు కథలును, శ్రీకృష్ణచరిత్రమును కలవు. ఉత్తరఖండమున ధర్మవేదాంతశాస్త్రవిషయము లును, వ్రతమాహాత్మ్యములును కలవు ఆరెండింటిలో పూర్వఖండమునందలి వస్తువు రసవత్తరము కావున సూరనకవి విష్ణుపురాణపూర్వఖండమును అనువదించెను. ఇందు అనేక భాగవతకథలు కలవు. వాని నతడు రసవత్తరముగా తీర్చిదిద్దెను. వానిలో ప్రహ్లాదోపాఖ్యానమునకు ఒకవైశిష్ట్యము కలదు. హిరణ్యకశిపుడు సైతము ప్రహ్లాదుని విష్ణుభక్తిప్రభావముచే భాగవతోత్తము డయ్యె ననుఅపూర్వకల్పన మందు కలదు. మరియు సూరన జడభరతోపాఖ్యానము, మాంధాతృచరిత్రము, తారాశశాంకవృత్తాంతము మొదలగుకథలను సామర్థ్యము తో నిర్వహించెను. ఇవియన్నియును ఒక యెత్తు. సూరన చిత్రించిన శ్రీకృష్ణచరిత్రఘట్ట మొకయెత్తు. ఇతడు మారనవలె పురాణశైలిని సారసుందరముగా వెలయించినాడు.

విష్ణుపురాణమును నాలుగంశములలో అనువదించిన మరియొకకవి కలిదిండి భావనారాయణ(16 శ.). ఈతని అనువాదము సమగ్రము కాదు. చాల వరకు మూలవిధేయము. ఎడనెడ అమూలకము లైన భావములను, వర్ణనలను

కూడ ఈకవి యొనర్చినాడు. చక్రపురి రాఘవాచారి రచించిన విష్ణుపురాణ మొండు కలదు కాని అది సంస్కృతపురాణమునకు అనువాదము కాదు.

భాగవతమహాపురాణములోని కొన్నిస్కంధములను మాత్రమే తెలుగు చేసిన కవులు కొందరున్నారు. మడికి సింగన దశమస్కంధమును, హరిభట్టు షష్ఠ, ఏకాదశ, ద్వాదశస్కంధములను, జనమంచి శేషాద్రిశర్మ దశమస్కంధమును, మిన్నికంటి గురునాథశర్మ ఏకాదశద్వాదశస్కంధములను, శ్రీమద్గురుభాగవత మను పేరను కొవ్వూరి పట్టాభిరామయ్యగారు ఏకాదశస్కంధమును, సంపన్ముడుంబ శ్రీరంగాచార్యగారు ప్రథమ ద్వితీయ పంచమదశమైకాదశద్వాదశస్కంధములను అనువదించిరి. హరిభట్టు వరాహపురాణమునందలి ఆదికాండనుమాత్రము తెలుగుచేసెను. అతడే విష్ణుధర్మోత్తరఖండమునుగూడ అనువదించినాడు. వాయుపురాణమునందలి మాఘమాహాత్మ్యమును ఒడ్డెపాటి పెద్దనకవి (16 శ.) అనువదించె నని తెలియుచున్నది. బ్రహ్మాండపురాణాంతర్గతము లైన అంశములను గైకొని రచింపబడినగ్రంథములు భద్రకవి లింగకవి రచించిన ద్విపద దేవాంగపురాణము, నుదురుపాటి వెంకటకవి మల్లుపురాణము.

## 9

అష్టాదశమహాపురాణములలో కొన్ని శ్రీమద్భాగవతమునకు బదులు దేవీభాగవతమును, వాయుపురాణమునకు బదులు శివపురాణమును పేర్కొనుచున్నవి. పురాణవిమర్శకులలో కొందరు వాయుశివపురాణము లొకటియనియు, దేవీభాగవతము కంటె శ్రీమద్భాగవతము ప్రాచీన మనియు తలంచుచున్నారు. తెలుగున భాగవతముతరువాత ప్రజాదరణము పొందిన పురాణము దేవీభాగవతము. మహాపురాణముగా దానిని లెక్కింపనంతమాత్రమున దాని ప్రతిష్ఠకు వచ్చిన నష్ట మిసుమంతయు లేదు.

గాయత్రీమంత్ర ప్రాశస్త్య నిరూపణాత్మకమును, శక్తిమాహాత్మ్యవర్ణన ప్రధానమును అయిన దేవీభాగవతము ఉపాసకులకును, త్రివిధగుణప్రవృత్తులైన సామాజికులకును సమముగా సంతోషము నీయగలదు. పాశవిక మైన దానవ శక్తిని నశింపచేయుటకు దైవశక్తులు దేవీరూపము దాల్చి విజృంభించిన రౌద్రరస

ఘట్టములును, దేవీమంత్రవరబలప్రసాదసిద్ధు లైన భక్తులు కామితార్థసిద్ధు లైన కథాఘట్టములును ఈపురాణమున సహజ మైన ఆసక్తిని కల్గించెడి కథార్థములు. ఈపురాణము మంత్రశాస్త్రరహస్యములకు ప్రసిద్ధి. కావున దేవీభాగవతానువాదకుడు కవియైనంతమాత్రమున చాలదు. అతడు ఉపాసకుడును, మంత్రవేత్తయు నై యుండవలెను. తెలుగున దేవీభాగవతము ననువదించినవా రందరును అట్టివారే.

క్రీ. శ. 18వ శతాబ్ది చరమపాదమునందును, 19వ శతాబ్దిపూర్వార్ధము నందును నివసించిన ములుగు పాపయారాధ్యులు దేవీభాగవతమును తెలుగున మొదటిసారి అనువదించిరి. వీరు ద్వాదశారాధ్యులలో ఒక రగు వేమనారాధ్యుల వంశమునకు చెందినవారట. వారి మొదటిపేరు సంగమేశ్వరశాస్త్రి. వారు ఆరాధ్యులయ్యును అద్వైతభావము కలవారు. వా రనువదించిన దేవీభాగవతము తెలుగుదేశమున అత్యంతప్రచార మందినది. క్రీ శ. 19వ శతాబ్దికి చెందిన త్రిపురాని తమ్మయకవి దేవీభాగవతము ననువదించె నని వారిపుత్రులు ప్రసిద్ధ కవులు నైన వెంకట సూర్యప్రసాదరాయకవి తన నిర్వచనకుమారసంభవ అవతారికలో పేర్కొనినాడు. కాని, అది నేడు మనకు లభించుట లేదు.

నేడు దేశమున అత్యంతప్రచారమున నున్న దేవీభాగవతము దాసు శ్రీరామకవిగారిది. (19 శ. ఉత్తరార్ధమునందిది తెలుగువారి పూజాపారాయణములకు పాత్రమై అలరారుచున్నది. శ్రీరామకవిగారు ఆధునికశ్రీనాథు లని ప్రశస్తి గాంచిన విద్వత్కవులు. వీరు సరళము. స్వతంత్రము నైన కవితచెప్పగలిగిన ఉట్టలు. దేవీభాగవతమును వీరు ఆశువుగా ఆరునెలలలో అనువదించినారట. సమకాలీనులు, దేవీభాగవతఅనువాదకులు అయిన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలవారు ఈదేవీభాగవతమునకు విపులపీఠిక వ్రాసి అందలి కవితావిశేషములను ప్రశంసించిరి. సమకాలీనుల ప్రశంస నందిన ఈగ్రంథము ప్రశస్త మనుటలో విప్రతిపత్తి యుండదుకదా? వీరి అనువాదము మూలాతివిధేయి కాదు, అతిస్వతంత్రము కాదు. ఎడనెడ వీరు స్వకపోలకల్పనలతో ఉపాఖ్యానములను, పాత్రచిత్రణమును, సన్నివేశచారుత్వమును, సహజవర్ణనలను రక్తికట్టించిరి. ధారాళ మైన వారికవితాధార పురాణశైలికి చక్కని యుదాహరణము.

అవధానకవితాచతురాననులైన తిరుపతివేంకటకవులును దేవీభాగవతము ననువదించిరి. శ్రీరామకవియనువాదము పురాణప్రశస్తికి పాత్రము కాగా వీరి యనువాదము ప్రబంధప్రశస్తికి నిలయమైనది. ఈజంటకవులు దేవీభాగవతమును భావానువాదప్రక్రియతో నిర్మించిరి. అందువలన అది అనువాద మన్నశంకయే పఠితలకు స్ఫురింపదు. తిరుపతివేంకటకవులు ఇందు నన్నయగారిప్రసన్నకథా కలితార్థయుక్తిని, తిక్కనగారి కావ్యకళాశిల్పరహస్యములను, స్వీయకవితామాధుర్యమునందు మేళవించి రచించిరి. ద్వాదశకాండమండితమైన ఈపురాణరచనమునందు తిరుపతివేంకటకవులతోపాటు వారికి సన్నిహితులైన మరికొందరు కవులుకూడ భాగస్వాములై ధన్యులైరి. నవమస్కంధమున మొదటిఅయిదును చివరిరెండుఅధ్యాయములను తిరుపతిశాస్త్రిగారి కుమారులైన వేంకటావధాని గారును, నవమస్కంధశేషము నిశ్శంకుల కృష్ణమూర్తి శాస్త్రిగారును. ఆకొండి రామమూర్తిగారును, దశమస్కంధమును వేంకటశాస్త్రిగారి పినతండ్రికొమరులైన చినవేంకటశాస్త్రిగారును రచించిరి ఇట్టిపదమదశమస్కంధములుకాక మిగిలిన గ్రంథమంతయు తిరుపతివేంకటకవులరచనమే. శిష్యులను తమతోపాటు పీట వేసి కూర్చుండబెట్టుకొనిన తిరుపతివేంకటకవులు హుళక్కి భాస్కరునికన్నను, బమ్మెరపోతరాజుకన్నను ఏమాత్రము తీసిపోరు.

ఆధునికులలో ఈపురాణము ననువదించినవారు జనమంచి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు గద్యానువాదమును వెలయించినవారు సరిపల్లి విశ్వనాథశాస్త్రి, స్థానాపతి రుక్మిణమ్మగారలు. కవిసమ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు దేవీభాగవతము నందలి మూడు స్కంధములను చంపువుగా ననువదించిరి. ఏలనో పురాణానువాదమును పూర్తిగావింపరైరి. దేవీపూజలు, నవరాత్ర్యుత్సవములు తెలుగునాట జరుగుచున్నంతవరకు దేవీభాగవతప్రచారమునకు తిరుగులేదు.

శివపురాణానువాదమును శ్రీముదిగొండ నాగవీరేశ్వరశాస్త్రిగారొనరించిరి (1947). సృష్టి, సతీ, పార్వతీ, కుమార, యుద్ధ, లీలా, లింగావిర్భావ, ఉమా, కైలాస,వాయవీయ, విద్యేశ్వరఖండములీయనువాదమున కలవు. మూలమునందలి సంహితావిభాగము నీకవి అనుసరింపక ఖండవిభాగమునుమాత్రమే గ్రహించెను. శాస్త్రిగారి అనువాదము మూలవిధేయముకాదు. పార్వతీ, కుమార, లింగవైభవ ఖండములను ఆయన విస్తరించి రచించెను. ఉమా,లీలా,కైలాస,వాయవీయఖండములను సంగ్రహించెను. సృష్ట్యాదిఖండములను మూలానుసారముగా రచించెను.

మూలమునందలి పునరుక్తములైన కథార్థములను తొలగించెను వాయవీయఖండమునందు ఉపమన్యు కథకు మారుగా పద్మపురాణాంతర్గతమైన మార్కండేయోపాఖ్యానమును గ్రహించెను. సమయోచితముగా ఈపురాణమున భాగవతస్కాందాదిపురాణములనుండియు మహాభారతమునుండియు కథార్థములను, భావములను పొందుపరచెను. ఆధునికయుగములో మూలవిధేయదృష్టినివీడి స్వతంత్రప్రతిభతో నిర్మింపబడిన పురాణములలో ఇది యొకటి.

శివపురాణభాగమైన జ్ఞానసంహితను మంత్రిప్రగడ భుజంగరాయకవి మూడాశ్వాసములలో అనువదించెను. ఇట్లెందరో మహానుభావులు పురాణానువాదములను చేసిరి. వారిని, వారిగ్రంథములను సమగ్రముగా పేర్కొనుట సాధ్యముకాని పని.

* * * *

తెలుగుకవులు మహాపురాణములపై చూపిన మక్కువ ఉపపురాణములపై చూపింపలేదు. ఆంధ్రీకృతములైన ఉపపురాణములసంఖ్య అత్యంత స్వల్పమగుటయే దీనికి కారణము. ఉపపురాణములను పురాణములే ఖిలము లనియు, అప్రమాణము లనియు గర్హించిన సందర్భములు కలవు. అప్రమాణపురాణములను తెలుగుకవులు గౌరవించలేదనుటలో కొంత ఔచిత్యము లేకపోలేదు. సంస్కృతసాహిత్యములో పురాణముల కున్న ప్రాముఖ్యము ఉపపురాణములకు లేదు. తెలుగున ప్రసిద్ధికెక్కి పదికాలములపాటు నిలువగలిగిన ఉపపురాణము ఉత్పత్తి కాలేదు. ఉపపురాణానువాదములలో పేర్కొనదగినవి ఆదిపురాణము, ఆదిత్యపురాణము, కల్కిపురాణము, గణేశపురాణము, మొదలనవి. ఆదిపురాణమును సర్వదేవకవి అనువదించినట్లు తెలియుచున్నది. ఆదిత్యమును ఎలకూచి వినయాదిత్యు (17 శ.) దనువదించెను. కాల్క్యమును చిలకపాటి రామానుజశర్మ చంపువుగను, పువ్వాడ బాలకృష్ణరావు వచనకృతిగను నిర్మించిరి. గణేశపురాణమును శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు తెలుగుచేసిరి

# 10

తెలుగున పురాణములు కాని పురాణములు కొన్ని కలవు వానిని మహాపురాణము లనుట కవి ప్రాచీనములు కావు. ఉపపురాణము లనుటకు ఉపశ్రుతి

ములలోని సృష్టివర్ణనమును పురాణలక్షణముకొరకు నిర్వహించినను. భావనా ఋషిచరిత్రమును విస్తరించి రచించి భావిభావనాఋషిమాహాత్మ్యకర్తలకు దారి చూపినాడు. పోచిరాజు వీరనామాత్యుడనుకవి సృష్టివర్ణనమును వదలి భావనా ఋషిమాహాత్మ్యమునే చంపూకావ్యముగా నిర్మించెను ఇతనికాలమునాటికి (19వ శతాబ్ది) పురాణచిహ్నమైన సృష్టివిద్యావర్ణనము వెనుకపడుటయే కాక, ఉపాఖ్యానము - పురాణము - మాహాత్మ్యము అనుమాటలలోని భేదముకూడ మాసిపోయినది. మొత్తమునకు ఈపురాణము మొదట ఒకకులముయొక్క చరిత్ర మై, ఆపై వంశకర్తలచరిత్ర మై, తరువాత వంశోద్ధారకుని మాహాత్మ్యముగా పరిణమించినది

ఇట్టివే విశ్వబ్రాహ్మణవైశ్యాదికులముల ఉత్పత్తివికాసములను చెప్పెడి వంశపురాణములు మరికొన్ని కలవు. విశ్వకర్మవంశచరిత్రను వెంకటార్యుడను కవి విశ్వకర్మపురాణ మనియు, మరియొక కవి విశ్వబ్రహ్మపురాణ మనియు రచించిరి. వైశ్యపురాణమును భాస్కరాచార్యుడు రచించెను. ఇట్టివే మనువంశపురాణము, గౌడపురాణము, సాగరపురాణము మొదలైనవి.

ఈశతాబ్దిలో వెలసిన మరిరెండుపురాణముల నిచ్చట పేర్కొనవలసి యున్నది. ఒకటి - సూతపురాణము; రెండవది ఆంధ్రపురాణము. సూతపురాణకర్త త్రిపురనేని రామస్వామిచౌదరిగారు. పురాణములన్నిటిని చారిత్రకదృష్టితో పరిశీలించినచో నిలువబడ వనియు, అందలికథలన్నియు కల్పితము లన్నియు, పురాణములు పిట్టకథలకు పుట్టినిల్లనియు వారు భావించిరి. తెలుగుదేశమున ఆర్య ద్రావిడజాతిభేదమునుగూర్చిన భావవిప్లవము నాయన తనసాహిత్యముద్వారా ప్రచారమునకు తెచ్చెను ఆర్యులు ద్రావిడజాతిని మోసగించి, వారిసామ్రాజ్యమును జయించి కొల్లగొట్టి రనియు, అగ్రవర్ణములవారు ఆర్యసంస్కృతి పేరుతో మిగిలినకులములను అణచివేసి రనియు, చెప్పెడిభావములను ప్రబోధించుటకై వారు సూతపురాణమును విసిర్మించిరి. దానిపై అనేకవాదోపవాదములుకూడ జరిగినవి. పురాణము నొక భావవిప్లవమునకు వాహికగా తీర్చిదిద్దువైఖరి యిందు కాననగును. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రచరిత్రలోని ఉజ్జ్వలేతిహాసఘట్టముల నెన్నుకొని ఉదయపర్వము మొదలుకొని నాయకరాజపర్వము వరకు తొమ్మిదిపర్వముల కావ్యముగా తీర్చిదిద్ది దానికి ఆంధ్రపురాణ మని పేరిడిరి. భావకవిత్వశాఖ యగు ప్రబోధకవిత్వలక్షణములిందు కానవచ్చు-

చున్నను. ప్రాచీనాంధ్రచరిత్రాధ్యాయముల రసవత్తరవర్ణన మిందు కలదు కావున పురాణనామ మందులకు సార్థక మని కవి భావించియుండవచ్చును. ఇతిహాస కథాకావ్యము పురాణనామముతో వెలసిన గని స్పష్టము. పురాణప్రక్రియను ఆధునికు లెట్టిప్రయోజనము నాశించి మలచుకొనిరో ఈరెండుకావ్యములవలన మనకు తెలియుచున్నది. అందువలననే అవి పురాణములు కాని పురాణములు లైనవి.

*　　*　　*　　*

పురాణప్రక్రియ వేదవాఙ్మయమునందే అంకురించినది. సర్గప్రతిపాదక వాక్యజాతమే పురాణ మని పరిగణింపబడినది. ఆపై పంచలక్షణవిశిష్ట మై పల్లవించినది. దశలక్షణోపేత మై విస్తరించినది. మహాపురాణము లవతరించినవి. విజ్ఞానసర్వస్వములుగా విశ్వరూపము దాల్చినవి. నవీనమతములు ఉపపురాణములను వెలయించి పురాణప్రతిష్ఠకు ప్రాకులాడినవి. జైనాదిమతములు పంచకల్యాణవిశిష్టము లైన తీర్థంకరాదులజీవితములను పురాణము లనుపేర ప్రకటించినవి. మతధర్మప్రచారమునకు పురాణములు ప్రజాసాహిత్యప్రక్రియలుగా గుర్తింపబడినవి. పురాణములు దేశీయభాషలలో అనూదితము లైనవి.

ఆంధ్రసాహిత్యమున మొదట వెలసినది స్వతంత్రదేశిపురాణము. వీర శైవమతమునకు మొదటిపురాణము. ఆప్రక్రియ తెలుగులో వృద్ధిపొందలేదు. ద్విపదబసవపురాణమే కాలాంతరమున గద్యపద్యాత్మకముగా వెలయవలసి వచ్చినది. మహాపురాణసంప్రదాయము దేశిపురాణసంప్రదాయమును ప్రతిఘటించినది. మహాపురాణానువాదము మొదలైనది. భక్తిమోక్షములకు సంగమక్షేత్రముగా ఆంధ్రమహాభాగవత మవతరించినది. తెలుగున పురాణప్రక్రియ పరిపూర్ణస్థితి నందుకొనది. ఈపరిణామము జరిగిన క్రీ.శ. 13వ శతాబ్దమునుండి 15వ శతాబ్దివరకు గల కాలము పురాణవాఙ్మయమునకు స్వర్ణయుగము. పురాణకవిత్రయమువారి కాలమదియే.

తెలుగున మహాపురాణానువాద మెంత పుష్కలముగా సాగినదో, పురాణఖండానువాద మంత పుష్టిమంతముగా వర్ధిల్లినది. పురాణరచనతో కావ్యప్రవృత్తి వర్ధిల్లినది. మూలానుసారము లైన వానికి రసవత్పురాణములంతటి ప్రసిద్ధి రాలేదు. పురాణము చివరకు వంశచరిత్రలకు, ఇతిహాసకథాకావ్యములకు తన పేరును గౌరవసూచకముగా నిలుపుకొన్నది. ఆధునికసాహిత్యయుగమునందు

పురాణప్రక్రియ ప్రాచీనసంప్రదాయమును పోషించు కవితాలహరిగా సాగివచ్చు చున్నది. దానిని స్థాలీపులాక న్యాయమున సమీక్షించుటయే ప్రస్తుత ప్రయత్నము.

పురాణము లనేక క్షేత్రమాహాత్మ్యములకును, కావ్యప్రబంధములకును తదితరము లైన సాహిత్యప్రక్రియలలో పెక్కింటికిని వస్తుప్రదానము చేసి వాఙ్మయవికాసమునకు తోడుపడినవి. పురాణకథలు కల్పనకు కల్పవృక్షములవంటివి. తత్కల్పవృక్షఫలసారము ఆంధ్రసాహిత్యజగత్తును రసరంజిత మొనర్చినది. ప్రసిద్ధప్రాచీనాంధ్రకవులెల్లరును బ్రహ్మాండాదినానాపురాణవిజ్ఞాననిరతులే. విశ్వవిజ్ఞానభాండారము లైన పురాణములను అధ్యయనము చేయుట అనగా వాఙ్మయ మహాసాగరమును ఆపోశన పట్టుటయే. వేదార్థబృంహితము లైన పురాణములు భారతీయసంస్కృతికి ఆలవాలములు. వాని పర్యాలోచనము భారతీయాత్మను దర్శించుట కనువైన సారస్వతయోగవిశేషము.

———

# 'దేశ భాషలందు తెలుగు లెస్స'




# ప్రపంచ తెలుగు మహా సభలు

1975, ఏప్రిల్ 12 — 18

ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# పురాణ వాఙ్మయము

రచయిత

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
రీడరు, తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు.








ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - హైదరాబాదు - 500004